# అభ్యుదయ

ఆంధ్రప్రదేశ్ అరసం మద్రాసుశాఖ పత్రిక □ ఫిబ్రవరి '78 60 పైసలు

కాలం కెరటాల మీద
కురిసిన ఓ కరుణ ధార
మెరిసిన ఓ అరుణ తార
మనిషి కలలు కదలి కనలి
విరిసిందొక దరహాసం
ఎగిరిందొక పతాకం
యుద్ధం ఇక వద్దంటూ
గుండె పొరలు తొలిచి కలచి
మరలెను మధురస్వప్నం

డార్లింగ్ చార్లీ

## ఆంధ్రప్రదేశ్ తుఫాను బాధితుల నిధికి

# అభ్యుదయ

### వసూళ్ళు

| | | |
|---|---|---|
| 1-12-77 | ముఖ్యమంత్రి నిధికి | రూ 1100-00 |
| 16-1-78 | ముఖ్యమంత్రి నిధికి | 720-00 |
| 10-1-77 | ప్రధాని నిధికి | 116-00 |
| 4-1-78 | విశాలాంధ్ర నిధికి | 1022-00 |
| 12-1-78 | విశాలాంధ్ర నిధికి | 1200-00 |
| | మొత్తం | రూ. 4158-00 |

### వివరాలు

| | |
|---|---|
| మద్రాసు మెహతానగర్ ప్రజానాట్యమండలి శాఖ ద్వారా వసూళ్ళు | 1200 00 |
| శ్రీ కె. జి. కె. మూర్తి ద్వారా బి. ఎస్. కె. ప్రెస్ సిబ్బంది రెండవ దఫా | 350 00 |
| శ్రీ వై. వి. యస్. యస్ ఎన్. మూర్తి ద్వారా | 40.00 |
| శ్రీ యు. జి. కె. సాయి ద్వారా | 116 00 |
| శ్రీ బి. హెచ్. ఎస్. నారాయణ మూర్తి ద్వారా బెహ్రైన్ నుండి వచ్చిన మొత్తం. | 720.00 |
| శ్రీ బి. జి. ప్రసాద్ ద్వారా | 37 00 |

# అభ్యుదయ

సంపుటి : 2 * ఫిబ్రవరి 1978 * సంచిక : 2




దేవులపల్లి
కృష్ణశాస్త్రి

నేటినుండి ఏనాటికి
వీటి తలుపు మూయకు!
కోటిమంది వచ్చినా
చోటున్నది లోన!

ప్రతి రోజూ వత్సరాది!
ప్రతి మనిషీ ప్రేమాతిథి!
చెరగనీకు పెదవులపై
చిరునవ్వుల ఆహ్వానము

ఎంత చిన్నదో లోకం
ఈ హృదయంలో ఇమిడింది

కోటిమంది వచ్చినా
చోటున్నది లోన!



ప్రత్యేక వ్యాసం

# ఆధునిక జీవితం - రచన

సొదుం రామ్మోహన్

మన నాగరికత పరిణామం చెందినంతగా మన సంస్కారం పెరగలేదనిపిస్తుంది. మన భౌతిక పరిస్థితులు మారిపోయిన మేరకు మన ఆత్మిక సంపద వృద్ధి కాలేదు. బూర్జువా నాగరికత వికసిస్తున్నప్పటికీ కొన్ని రంగాల్లో మనం ఇంకా ఫ్యూడల్ దుర్గంధాన్నే సగర్వంగా ఆఘ్రాణిస్తున్నాం. ముఖ్యంగా పెళ్ళి ప్రేమలకు సంబంధించి మన భావాలు—మరీ స్పష్టంగా చెప్పాలంటే నేటి వృద్ధతరం భావాలు మరీ వెనక బాటుగా వున్నాయి.

ఈనాడు పట్టణ నాగరికత గుమ్మడి పాదులా విస్తరిస్తోంది. పల్లెల్నించి జనాలు పట్టణాలకు ఎగబడి పోతున్నారు. పట్టణాల జనాభా తామరతంపరగా పెరిగిపోతోంది. పట్టణాల్లోని యువతీ, యువకుల సంబంధాలకూ, పల్లెల్లోని యువతీ యువకుల సంబంధాలకూ చాలా తేడా ఉంది.

పట్టణాల్లోని యువతీ యువకుల్లో అత్యధికులు అంతో ఇంతో చదువుకున్నవారే. యువతుల్లో కనీసం కొంతమంది ఏదో ఒక రకం ఉద్యోగాలు చేస్తున్నవారే. ఉద్యోగాలు చేస్తున్నవారు యువతీ యువకులు నిత్యం రోడ్లమీద కానీ బస్సుల్లో కానీ హోటళ్ళలో కానీ ఆఫీసుల్లో కానీ దగ్గరగా వుండక తప్పడం లేదు. ఈ భౌతిక సాన్నిహిత్యం అన్ని సందర్భాల్లోనూ, అందరి విషయంలోనూ కాకపోయినా కనీసం ఎక్కువ సందర్భాల్లో ఎక్కువమంది విషయంలో మానసిక సాన్నిహిత్యానికి దారితీసే అవకాశం వుంది. తరుచుగా ఆఫీసుల్లో, హోటళ్ళలో కలిసే యువతీ యువకులు సెక్స్, ప్రేమ, పెళ్ళి విషయాలతో సహా అనేక అంశాలపై చాలా సన్నిహితంగా, అరమరికలు లేకుండా మాట్లాడుతుండడం కూడా కద్దు. మరో విశేషమేమిటంటే, యువతీ యువకులన్నతర్వాత నూతన అనుభవాలకోసం ఆరాటం, అన్వేషణ వాటిపట్ల ఉత్సుకత ఉండడం అతి సహజం. ఇంకొంచెం స్పష్టంగాచెప్పాలంటే ఆ వయసులో శృంగార భావాల మేఘాలలో తేలిపోతుండడం సహజం. యువకులకైతే తిరుమల కొండుర్తి అన్నట్లు:

" పరమ శివునిలా పగలూ రాత్రీ
సతీ స్పర్శ సాగా" లనిపిస్తుంది

"పొద్దస్తమానం కనిపించే
పక్కింటి వారి అమ్మాయి
పామై కరుస్తుంది"
"ఆకసం వైపు కళ్ళెత్తితే
అచ్చరలు పిలిచి నట్లుంటోంది."

ఈ మనస్థితికి గురయ్యే యువతీ యువకులు పెళ్ళికాకముందే లైంగిక సంబంధాలు కలిగి వుండడం కానీ, లైంగిక సంబంధాలు మినహా మధురమైన మైత్రీ సంబంధాలు కలిగివుండడం కానీ ఆశ్చర్యమేం కాదు. పట్టణాల్లోని యువతీయువకులు దాదాపు పగటి పూటంతా ఇంటి బయటే గడపవలసి వుండడం కూడా లైంగిక సంబంధాల ప్రేరణకు మైత్రికి దారి తీయడం కద్దు.

అయితే వచ్చిన చిక్కేమిటంటే, పట్టణాల్లోని నేటి యువతీ యువకుల ఈ ప్రవృత్తిని, ప్రవర్తనని వృద్ధతరం ఆమోదించలేక పోతున్నది. వాళ్ళ కూతుళ్ళు ఆఫీసుల్లోని సహ ఉద్యోగులతోనో పక్కింటి యువకులతోనూ మనసారా మాట్లాడితేనే మండి పడుతున్నారు. మళ్ళీ కూతుళ్ళు కూడా ఉద్యోగాలు చేస్తేగాని గడవదు పట్టణాల్లో. కానీ ఆ కూతుళ్ళు మాత్రం పరపురుషులతో మాట్లాడకూడదు. వాళ్ళతో చనువుగా వుంటే మంట. వాళ్ళు ఫక్తు 'సహూ బాయి'లాగా మాత్రమే వ్యవహరించాలి. అమ్మాయిలకి ఉద్యోగాలు దొరగ్గానే పెళ్ళిళ్ళయితే తప్ప మన పెద్దల ఆత్మ శాంతింపదు. 'నా పెళ్ళికి తొందరేం లేద్దు' అంటే కొంపలంటుకున్నంత క్షోభ పడిపోతారు. మగాడ్ని బ్రహ్మచారిగా క్షమిస్తారు కానీ ఆడది మాత్రం అవివాహితగా వుంటే ముళ్ళమీద నడిచినట్లు బాధ పడతారు. ఆడాళ్ళు అలాగే అవివాహితలుగా శాశ్వతంగా వుండాలనికాదు. కానీకొన్నాళ్ళపాటు వుంటే నష్టమేమిటని? మన పెద్దల ఈ మనస్తత్వం ఆధునిక జీవన సరళికి అనుగుణమైంది కాదు. ఈ మనస్తత్వం నూబినుంచి మన పెద్దలు-కనీసం చాలామంది-బయట పడలేక పోతున్నారు. ఆధునిక జీవితంలోని ఒక వైరుధ్యం ఇది. అంటే ఆధునిక యువతీ యువకుల జీవన సరళితో (ఆలస్యంగా పెళ్ళిళ్ళు చేసుకోవడం, అవివాహిత దశలో శృంగార సంబంధాలు-అరుదుగానే కావచ్చు-కలిగి వుండడం) వృద్ధతరం మనస్తత్వం రాజీ పడలేక పోతున్న వైరుధ్యం.

నేటి ఈ వైరుధ్యాన్ని ప్రతిబింబిస్తూ మన పెద్దల సంస్కారానికి వెల్లవేయడానికి మంచి కథలు రాయొచ్చు: రాయాల్సిన అవసరం వుంది కూడా. నాకు తెలిసినంత వరకు కొడవటిగంటి కుటుంబరావు ఆ మధ్య ఇలాటిది ఒక కథ రాశారు. ఆ కథపేరు "చెడిపోయిన మనిషి."

ఆ కథ సారాంశం ఇది. పార్వతీశం అనే ఒక మొండివాడుంటాడు. ఆయన వయసు యాభై. అతను తన పరిసరాలలోని వ్యక్తులకి సుఖం అందివ్వలేడు సరికదా

---

యితరులలో కనపడేమాలిన్యమెప్పుడూ హృదయదర్పణాల ప్రతిబింబితమైనస్వకీయకల్మషమే.
— చెలం

కషాలూ, మనఃక్లేశమూ మాత్రమే ఇచ్చే బాపతు. ఆయనకో కూతురు. ఆమె పేరు వర్ధని. ఆ అమ్మాయి బి.ఏ.బి.ఇడి. పాసై ఉద్యోగంచేస్తూ తండ్రిని కూడాపోషిస్తున్నది. ఒకరోజు స్నేహితుడనబడే ఓ శత్రువు పార్వతీశం మనసులో విషం పోస్తాడు. వర్ధని ఉద్యోగం చేస్తూ ఇంటిల్లిపాదిని పోషించడం నచ్చక ద్వేషంతోవాడుఆమెపై నిందలు వేస్తాడు. ఆ అమ్మాయి ఒళ్ళు అమ్ముకుంటుందని ధ్వనించేలా మాట్లాడతాడు. పార్వతీశం మండిపడతాడు. వర్ధనిని ఒక రోజు రామం అనే ఓ ఓవర్సీర్ ఇంటివద్దకు కారులో తీసుకొచ్చి దిగబెడతాడు. "ఎవరీ ఓవర్సీడు గాడు?" అని నానా హంగామా చేస్తాడు. పాపం ఆ అమ్మాయి "నేను ఒళ్ళమ్ముకుని బతకటం లేదు ఆ విషయం నిశ్చింతగా ఉండొచ్చు" అంటుంది శాంతంగా. కానీ ముసిలాడి టెన్షన్ తగ్గదు. నానా తిట్లూ తిడతాడు. ఆమెకు కోపం వచ్చి "రామం గారు నాకు మంచి స్నేహితుడు. నీకెందుకు ఆరాలన్నీ. నాకు నువ్వు మామగారివా? అత్తగారివా?" అంటుంది రౌద్రంగా. ముసిలాడు విచక్షణా జ్ఞానం కోల్పోయి ఫ్యూడల్ పితృస్వామిక అహంభావంతో "నీ పడుపు కూడు నాకక్కర్లేదు" అంటూ ఆ వూరువిడిచి మద్రాసు పారిపోతాడు. అతను రైళ్ళో పస్తువల్ల శోషతో పడిపోతే హృదయంగల ఒక లేడీ డాక్టర్ అతన్ని ఇంటికి తీసుకెళ్ళి సపర్యలు చేసి అతనికి తిరిగి స్పృహ తెప్పిస్తుంది. అతను అక్కడే కొన్నాళ్ళుంటాడు. అక్కడ అతనికి ఆధునిక జీవితం తాలూకు నగ్న సత్యం ఒకటి తెలిసొస్తుంది.

ఆ లేడీ డాక్టర్ గుండెలో 'చెమ్మ'గల ఆడది. అవివాహిత. ఆమెకు ప్రభాకర్ అనే ఓ యువక మిత్రుడుంటాడు. ఈ ప్రభాకర్ ఇంట్లో మన ముసలపీనుగ పార్వతీశం విశ్రాంతి తీసుకొంటాడు. ఒక రోజు రాత్రి పార్వతీశం ఒక గదిలో పడుకుని వుంటాడు. అప్పుడు ఈ క్రింది సంఘటన జరిగినట్లు పార్వతీశం గ్రహిస్తాడు.

"ఇద్దరు ముగ్గురు మనుషులు మాట్లాడుకుంటూ మెట్లకేసి వచ్చారు. గొంతుల్ని బట్టి డాక్టరూ, ప్రభాకరూ అని పార్వతీశం పోల్చుకున్నాడు. మూడో గొంతు వినిపించలేదు. ఇద్దరూ మెట్లెక్కి పైకి వెళ్ళిపోయారు. వాళ్ళ అడుగుల చప్పుడును బట్టి ఒకరి గమనాన్ని ఒకరు భంగం చేస్తున్నట్లు స్పష్టమైంది. (అంటే అగి ముద్దులు పెట్టుకుంటూ పైకి వెళ్ళారని సూచ్యం-వ్యాసకర్త.)

"మహా గడ్డు పరిస్థితిలో తనను ఆదుకున్న డాక్టర్ మిస్సమ్మ ఏ మంత నీతిగా బతుకుతున్న మనిషి కాదు. దిగి వచ్చేటప్పుడు డాక్టర్ మెట్లమీద విరగబడి నవ్విన పద్ధతి, ప్రభాకర్ స్టాప్ అన్న పద్ధతి చూస్తే వాళ్ళు బాగా తాగినట్లు కూడా పార్వతీశానికి అనుమానం కలిగింది."

ఈ సంఘటన చూసి పార్వతీశానికి దోకు వచ్చినంత పనై ప్రొద్దున్నే లేడీ డాక్టర్తో తనుఇంటినుంచి పారిపోయి వచ్చిన విషయం పూస గుచ్చినట్టు చెపుతాడు అప్పుడా లేడీ డాక్టర్ ఇలా అంటిస్తుంది.

"మీ అమ్మాయి దగ్గరికి తిరిగి వెళ్ళండి, ఆవిడ మానాన ఆవిడను బతక నివ్వండి. ఆడది పెళ్ళి చేసుకుని గృహిణిగానూ, పిల్లల తల్లిగానూ బతకడం తప్ప మీరు మరో మాదిరి జీవితం ఊహించ లేకపోతున్నారు. మీరామె జీవితాన్ని మెంత్రుక వాసి కదపలేరు. అందుకో జోక్యం ఎందుకు కలిగించుకుంటారు?"

"మగవాడు ప్రభాకర్ లాగా బ్రహ్మచారిగా వుండిపోతే సంఘానికెంత నష్టమో నాబోటిదీ మీ అమ్మాయి బోటిదీ పెళ్ళి కాకుండా ఉండిపోతే అంతే నష్టం ఒకప్పు డెప్పుడో ప్రిమిటివ్ కమ్యూనిటీలలో అందరికీ ఒకే నియమాలుండేవిట. ఈనాడు మనమింకా అదే మనస్తత్వంలో జీవించటం చాలా హాస్యాస్పదం! మనిషి నుండి మనిషికి సాధ్యమైనంత హెచ్చు ఉపకారమూ. సాధ్యమైనంత తక్కువ అప కారమూ జరిగేట్టు చూసుకోవడమే సరైన ప్రవర్తన. మిగిలిన బూటకపు నీతి నియ మాలను నమ్మకండి." ఈమాటలు వినగానే పార్వతీశం ఇంటికి తిరుగు ప్రయాణం పడతాడు. అది వేరే విషయం.

అసలు విషయం ఏమటంటే ఆధునిక జీవితంలో వస్తున్న మార్పులకు అను గుణంగా మనం మన ప్రవర్తనని మలుచుకోలేక పోతున్నాం. ఫలితంగా జీవి తాలు కొంతమేరకు అనవసరంగా దుఃఖ భాజనా లవుతున్నాయి. ఇలా కాకుండా చూడాల్సిన బాధ్యత ముఖ్యంగా రచయితల మీద ఎక్కువగా ఉంది. ప్రత్యేకించి కథకులు, నాటక రచయితలు, నవలాకారులు ఆధునిక జీవితంలోని సంక్లిష్టతలనీ, వైరుధ్యాలనీ పరిశీలించి పాఠకుల సంస్కారాన్ని సామాజిక వ్యవస్థకు అనుగుణంగా తీర్చి దిద్దాల్సిన అవసరాన్ని గుర్తించాలి. ఆ పని సక్రుత్తుగా మాత్రమే జరుగు తున్నదన్నదే ఫిర్యాదు.

ఉద్యోగం, తిండి, డబ్బు, హోదా, డాబాలు వగైరాలనే మనం గీటురాళ్లగా చూస్తున్నాం. ఎదుటి వారికి సాధ్యమైనంత ఎక్కువ ఉపకారం సాధ్యమైనంత తక్కువ అపకారం చేయడమే సరైన ప్రవర్తన అని భావించే సంస్కారం మనకింకా వంటబట్టలేదు. అలా వంటబట్టించడంలో రచయితలు చేయగలిగినంత దోహదం మిగతా కళాకారులెవ్వరూ చేయలేరనిపిస్తుంది.

రాజకీయాల్లో మాత్రమే మనం అభ్యుదయం, విప్లవం చూడగలుగుతున్నాం. కానీ స్త్రీ, పురుషుల సంబంధాలలో వస్తున్న మార్పులను, రాతగిన మార్పులను ప్రగతిశీల దృక్పథంతో చూసే అలవాటుకాలేదు. స్త్రీ పురుష సంబంధాలకు సంబం ధించి బూర్జువా సంస్కారానిని సైతం ప్రదర్శింపలేని యువకులు "విప్లవం" కేకలు వేయడం మన మెరుగుదుం. స్త్రీ పురుష సంబంధాలలో విశృంఖలతను సమర్థించమని కోరడం లేదు. కాకపోతే పారిశ్రామికీకరణ, పట్టణాల అభివృద్ధి క్రమం పర్యవ సానంగా పరిణమించే నూతన మానవ సంబంధాలను, నూతన విలువలను కాస్త ప్రగతి శీల దృక్పథంతో, కాస్త ఉదార భావంతో చూడడం నేర్చుకోవాలి. ఈ విష యంలో రచయితలు చాలా కృషిచేయవచ్చు. 

# కన్నడ కవిత □□□□□□ శ్రీ వ్రజ మట్టి

## హక్కి నొడయర హాడు

వెమురిదుదుడిదరూ మైగిల్ల ఆధార,
హసెయ బరహ విదెంబ
బొమ్మకంతెయ మాతు
ఎష్టు దిన నంబేవు: ఎష్టుదిన సైసేవు
భ్రాంతి భిత్తియె నొడెద
క్రాంతి వీరరు నావు
సహనె హోగిదె మీరి కొడతుంబి
తుళుకిహుదు
ఒందు హనియె సాకు సాగరవు
ఉక్కువుదు
ఒందు కణనే సాకు హిమగిరిగె
ఒక్కువుదు
ఒందు చణవే సాకు కాల
పక్కాగు ఉదు
ఆ దేశ యీ దేశ దేశ దేశద సీమె
మీరి సీమాతీత దేశ ఒందిదె నమగె
వమ్మ నమ్మయ నడువె కట్టెరువ
గోడెగళ
ఒడెదు మున్నుగ్గు వెవు ఇందు
ఒందాగువెవు
క్రాంతి కరెదరె బరదు క్రాంతి
బరెదరె బరదు
శోషణయ హద హారిదు హద్దు
మీరిదువాగ
శోషితర నెత్తరలి క్రాంతికిడి
హారువుదు
కవితె స్వాగతెగయిదు
జయగీతె హాడువుదు

## హక్కుల అధిపతుల పాట

ఎముకలు విరుచుకుని పాటుపడినా
బ్రతుకు సాగదు
బ్రహ్మరాత అర్థరహితం
నమ్మడం ఎంతకాలం భరించడ
మెంత కాలం
ఈ భ్రమను బద్దలు కొట్టిన
విప్లవ వీరులం మేము
అంతరించింది మా సహనం
కుండ నిండి తొణికిపోయింది నీరు
ఒక్క చుక్క సాగరమై
ఉవ్వెత్తుగ లేచింది
ఒక్క కణం చాలు హిమగిరిని
మీరిపోవడానికి
ఒక్క క్షణం చాలు సర్వం
కూలడానికి
దేశ దేశాల సరిహద్దుల కావల
వుందొక దేశం మాకు
మా చుట్టూ వున్న గోడలు పడగొట్టి
దూకుతాం ముందుకు
ఏకమవుతాం యీనాడే
విప్లవం రాదు మాటలతో
విప్లవం రాదు రాతలతో
దోపిడీ హద్దు మీరితే
పీడితుల రక్తం నుండి
ఉవ్వెత్తుగ లేస్తుంది విప్లవాగ్నికణం
ఈవిప్లవానికి స్వాగతమిస్తుంది కవిత
కవిత పాడుతుంది జయగీత.

పసుపులేటి రామారావు

# నక్కల విందు

కథానిక

చెరిగిపోని కథలు-
మాయదారి మోసాలు-
అవినీతి నృత్యాలు...
అన్యాయపు దారుణాలు-

స్వార్థపు కుట్రలూ..ఇన్నిటినిసృష్టించే ఆ రాత్రికి అయుష్షు మూడున్నర గంటలు నిండింది. అంటే-సుమారు తొమ్మిది గంటలు దాటిందన్నమాట! మొదటాట సినిమా వదిలేశారు. ఆ రాత్రి అందించే నాటు సారాలాంటి అనందాన్ని ఇంకా జుర్రుకుందామనే విశాచరులు, ఆ రాత్రిలోని 'చీకటి స్వర్గాల' నుభవిద్దామని దూరదూరాలనుండివచ్చే ఆనందప్రియుల తోను ఆ సినిమా హాలు ప్రాంతం సందడిగా ఉంది. సినిమా హాలులోకి ప్రవేశించే స్త్రీల ప్రవేశపు గేటుకు కొంచెం అటు ప్రక్కగా భుజాన ఓ బిడ్డనెత్తుకుని నిలబడ్డదో స్త్రీ. ఆ స్త్రీకి ఓ పది గజాల దూరంలో—ఇప్పుడో, అనకో చచ్చే రోగిష్టిలాంటి-వెలుగుతూ, ఆరిపోతూన్న ఎలక్ట్రీ దీప స్తంభం!

మూసి ఉంచినగుప్పెట్లోని వస్తువులా ఆమె గుండెలోని ఎర్రగా కాలిఉన్న నిప్పు కణిక లాంటి 'గతం' ఎవరికి తెలుస్తుంది? అసలెవరిక్కావాలి!

రిక్షావాళ్ళ దృష్టిలో ఆమె-పావలా డబ్బులకు పడుకునేది!

ఆ మాట కరెక్టే! అయితే, ఇప్పుడయితే ఆమె పావలాకు, టీనీళ్ళకు కక్కుర్తి పడుతోంది. కాని, ఐదారు నెలల వరకు ఆమె-'క్లాస్ వన్'లాడ్జిల్లోరంభ, ఊర్వశి, మేనకల్లాంటి పేర్లతో వెల్గిన సొగసుగత్తె!

ఆమె పుట్టుపూర్వోత్తరాల సంగతి ఏమోగాని, కొన్నాళ్ళగా ఆమెగుండెలో ఆరని మంటలా నిలచి ఉన్న ఓసంఘటన మాత్రం తననిప్పటికీ మాడ్చి వేస్తూనే ఉంది....అది ఎప్పటికీ ఆరని మంటే ఆమె జీవితాంతం వరకు.

o o o

భుజంగరావు గారికి వరుసగా మూడు పెళ్ళిళ్ళయ్యాయి. ముగ్గురు భార్యలూ గతించారు. చిత్రమేమంటే ముగ్గురిలో ఒక్కావిడకూ సంతానం లేదు. అది భుజంగరావుగారికి తీరనిచింతై పోయింది. అంతాస్తికి ఒకవారసుడంటూ లేకపోవటం చింతగాదూ? ఇక పెళ్ళనేది చేసుకోకూడదని నిర్ణయించుకుని ఓ శుభ ముహూర్తాన తిన్నగా పట్టణంలోని తాయారింటికెళ్ళాడు. తాయారుకు భుజంగరావంటే చెప్పుకోతగ్గ పరిచయమూ, చెప్పరాని ప్రేమాను! భుజంగరావు గారి చింతను విని, దీర్ఘంగా నిట్టూర్చి ఆయనడిగిన సలహాకు తలూపింది. భుజంగరావుగారిని లోపలకు తీసుకెళ్ళి ఒక అమ్మాయిని చూపించింది. ఆ అమ్మాయిని చూసిన

భుజంగరావుకు నోరూరి పోయింది ... వళ్ళు వేడెక్కిపోయింది.

"ఒక నెలే అయింది వచ్చి మీ మీద ప్రేమవల్ల పంపుతున్నాను." అంది తాయారు.

భుజంగరావు రేటడిగాడు. ఐదు వేలంది 'అంత రేటా' అని భుజంగ రావడగ లేదు.

కానీ తాయారే-"ఏం చెయ్యను బాబు! నేను కొనటమే మూడు వేలకికొన్నాను. ఈ లోగా పోలీసోళ్ళని, బోకరు నా కొడుకుల్ని మేపటానికే తక్కిన రెండేలూ అయిపోయింది. ఇందులో నాకు మిగిలిచచ్చిందేం లేదు. పెద్దోరు వచ్చారని కాని...."

భుజంగరావు బేరమాడ లేదు. ఐదు వేలిచ్చేసి వెళ్ళిపోయి మరునాడొచ్చి ఆ అమ్మాయిని తీసుకపోయాడు. ఆ పట్టణంలో మారుమూలన మంచి ఇల్లొకటి చూసి, కొత్తింట్లో సరికొత్త కాపురం పెట్టాడు.

భుజంగరావు కోరిక ప్రకారం, సంవత్సరాని కల్లా మగ బిడ్డను ప్రసవించింది. భుజంగరావు తన వారసుణ్ని చూసుకుని మురిసి పోయాడు.

ఆ రొంపిలోంచిబయటకులాక్కొచ్చి తన నొక మనిషిగా నిలబెట్టినందుకు ఋణం తీర్చుకున్నానని తృప్తిగా గాలి పీల్చుకుందామె.

ఒకనాటి రాత్రి....భుజంగరావు ఇల్లు ఖాళీ చేస్తున్న సంగతి సూటిగా చెప్పేశాడు. అసలు విషయం తెలిసి సత్యవతి బావురుమంది. కాళ్ళా వేళ్ళా పడింది. పని మనిషిగానైనా ఆయింట్లో బ్రతకనీయమంది...ఆ బిడ్డకు తల్లిగా చెప్పుకోకుండా దాసీగానైనా ఉంటానంది.

భుజంగరావు కరుగుతాడా! కాల సర్పం కాటువేస్తుంది కానీ, జాలి చూపుతుందా?

ఆ మరునాడే తాయారు పంపిన ఇద్దరు మనుషులొచ్చి బిడ్డ నుండి విడదీసి బలవంతంగా సత్యవతిని లాక్కు

# నాయకులు

ఆ రాత్రి
గుండెలదిరే వేళ
గుమి కూడిన
గువ్వ ప్రాణుల మీద
గుడి కూలింది!
మతం నవ్వింది
మానవత్వం చచ్చింది!!
డేగలకన్నా ముందు
దేశాధి నేతలొచ్చారు!
నీళ్ళుతెచ్చిన కన్నీళ్ళకు
వీళ్ళు చేసిందేమిటి?

వచ్చే ఎన్నికల సంతలో
ఓటు ధర తగ్గించేందుకు
ఒకర్నొకరు తిట్టుకున్నారు
వచ్చిన దారినే పోయ్యారు!
ఇదంతా చూసి
ఇంకా తగలబడని శవం
పగలబడి నవ్వింది
అయితేనేం, వాళ్ళు
రాజకీయ నాయకులు
రాక్షసులకు వారసులు!!

టి. ప్రసన్నకుమార్

# పురోగమనం

ఉపద్రష్ట సాయి

దశాబ్దాలు దాటినా
శతాబ్దాలు మారినా
నీతరం మారనిది
నీ గతం వేరనది
నీ అబ్బలు మోసిన రాళ్ళు
నీ తాతలు తోడిన నీళ్ళు
నీ చుట్టూ మిగిల్చాయి
ఎన్నటికీకదలని గోరీలు
నీ జీవితమొక శ్మశానమైతే
నువ్వొక జీవచ్ఛవం
ప్రకృతి పెట్టిన భిక్షం సైతం
ప్రభుత్వం నీకు పెట్టదు
ఒకపూట గంజికోసం
అరడుగుల నేలకోసం
అల్లాడే అన్నార్తులు
అంతటా కనబడుతున్నారు!
గడ్డిపోచల మధ్య
మద్దిచెట్లలా శ్రామిక వర్గం మధ్య
కొందరు భూ స్వాములు, జమీందార్లు
అహర్నిశలు అదిమిపెడుతూ ఉంటే
పురోగమనం ఎక్కడ.
పురోగమించే దెవరు?
సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు
పడమట అస్తమిస్తాడు
సామాన్యుడు సణుగుతునే ఉంటాడు
చరిత్ర పుటలకెక్కుతూ ఉంటుంది.
దశాబ్దాలు దాటి
శతాబ్దంలో చేరుతుంది.

---

పోయారు. భుజంగరావు బిడ్డతో తన వూరెళ్లి పోయాడు!

ఆమె శరీరా న్నమ్ముకునే పతితే. కానీ, ఆమె మనిషి కాదూ?

ఆమె స్త్రీ కాదూ?

ఆమెలో కన్నతల్లి ప్రేగు లేదూ?

ఆమెలో- కన్నబిడ్డ కోసం భోరున ఏడ్చే మనసు లేదూ?

సత్యవతి తాయారు ఇంటి కొచ్చాక కొన్నేళ్ళు ఆవిడ వ్యాపారాన్ని అభివృద్ధి చేసింది.

చివరకు వదలని రోగాలు పట్టుకోవ టంతో, వంటి సునుపులు, బిగువులు సడలిపోగానే 'ఛీ పొమ్మని' గెంటేసింది తాయారు. తనలో ఉన్న జబ్బులు తప్ప దిక్కూ లేదూ, మొక్కూ లేదు. దానికి తోడు గర్భం.

ఆమెలో ఇంకా ఏ మూలనో కళా కాంతు లుండటంతో ప్రసవించే వరకూ రోజులు మామూలుగానే గడిచిపోయాయి. ప్రసవంతో బాటు ఆరోగ్యం పూర్తిగా పాడై పోయింది. అనాకారితనం, అంట రాని రోగాలు ఆమెను పీడించటంతో ఒక్క రోజు గడవటమే ఆమెకు దారుణమై పోయింది. ఆ పరిస్థితుల్లో ఆమెకా పెద్ద కొడుకుంటే?....ఆమెకు కొండంత అండ కాదూ? ఆ రోగిష్టి బ్రతుకు నుండి, పాపిష్టి బ్రతుకు నుండి 'ముక్తి' అయ్యేది గాదూ?

రోజుకో పూటయినా ఇంత గంజి నీళ్ళు తెచ్చి యిచ్చేవాడు కాదూ?

ఇలాంటి సంకట పరిస్థితుల్లో సత్య

## మేమూ మనుష్యులం

మేమూ మనుష్యులం
సాగిస్తున్నాం జీవిత సమరం
ఎంత కాలమో? ఇంకెంత కాలమో?

పశువు మేసే చోటులేదు
పట్టెడన్నం మాకు లేదు
దుక్కి దున్నను పొలంలేదు
దూడ కింతా కసువులేదు
గతకడానికి మెతుకులేదు
బతక డానికి బాధ ఎక్కువ
మేమూ మనుష్యులం
సాగిస్తున్నాం జీవిత సమరం
ఎంతకాలమో? ఇంకెంత కాలమో?

పచ్చినెత్తురు ప్రజ్వలించే జ్వాలగా
బ్రతుకు తెరువుల యోచనల మాలగా
జ్వలిస్తూ ధరిస్తూ ధరిస్తూ జ్వలిస్తూ
ఎముకల మరతుపాకుల్లోంచి
ఎర్రటి బుల్లెట్లను కురిపిస్తూ
శ్రమ జీవన ఆశాజ్యోతిని వెలిగిస్తూ
సాగుతూ ఆగుతూ ఆగుతూ సాగుతూ
పారిపోకా విలువలేకా
కదలలేకా మెదలలేకా
సాగిస్తున్నాం జీవిత సమరం
ఎంత కాలమో? ఇంకెంతకాలమో?

పట్టు విడవకా జట్టు చెదరకా
సాగిస్తున్నాం జీవిత సమరం
ఎంత కాలమో? ఇంకెంత కాలమో?

యస్. జి. డి. చంద్రశేఖర్

వతికో మార్గం దొరికింది. 'వ్యాపారం' చేసుకునే కోటి స్త్రీలు ఆమె బిడ్డను తీసుకుపోయి కొంచింది ఇవ్వసాగారు. భుజం మీద బిడ్డ ఉండడంతో సంసార స్త్రీగా కనిపించి మంచి రేటు పలుకుతుంది!

అదీ గాక పోలీసుల బాధ ఉండదు!

దీనితో ఆ బిడ్డ వల్ల ఒక రాత్రికి సుమారు ఐదు రూపాయలు సంపాదిస్తోంది!

ఆమెను పోషించే ఆ పసికందు ఆమెకు ప్రాణమూ, రక్ష, ఆధారం.

ఆ రాత్రి ఆ బిడ్డ నెవరూ తీసుకెళ్ళక పోవడంతో తనే బిడ్డ నెత్తుకుని చీకటి మాటున నిల్చుంది! ప్రొద్దుట్నుంచీ తనకూ, బిడ్డకూ కూడ ఆహార మనేది లేదు. అందుకే ఆ సినిమా హాలు దగ్గిర కొచ్చింది. ఎదురు చూస్తోంది.....

* * *

సత్యవతికి బేరం తగిలింది!

రిక్షా ఎక్కింది. రిక్షా వెనుక ఓ స్టూడెంటు కుర్రాడు. అంచేత రేటు బాగానే పలకొచ్చు.

వెళ్ళి వెళ్ళి వూరు చివర ఓ డాబా ముందాగింది రిక్షా. ఆ డాబా దాటితే పొలాలు, రైలు బ్రిడ్జి.

వరండాలో ముగ్గురు కుర్రాళ్ళున్నారు ఎదురు చూస్తూ.

"ఒరేయ్ మర్చేపోయాను. మీరెళ్లి తినటానికే మయినా తెండి. మందు సరిపోతుంది కదూ?" అన్నాడు. రిక్షా కూడా వచ్చిన కుర్రాడు.

"ఎప్పుడూ ఇలాంటి ఎదవ వన్లే చేస్తావు...అసలే ఆకలితో చస్తుంటే"

అంటూ ముగ్గురూ వెళ్ళి రిక్షాలో దూరారు.

"ఇదిగో నీ పేరేంటి?" కుర్రాడు.

"సత్యవతి"

"బాగానే ఉంది. ఆ పిల్లాడ్ని ఇక్కడ మంచం మీద పడేసి నువ్వు లోపలికి నడు" అని ఆ కుర్రాడు లోపల కెళ్ళాడు. చేసేది లేక కుర్రాణ్ణి బయట మంచం మీద పడుకోబెట్టి లోపల కెళ్ళింది.

తలుపులు మూసుకున్నాయి.

కొంచెం సేపటికి ఫలహారాలతో వచ్చారు ముగ్గురు కుర్రాళ్ళూను. మంచం మీద బిడ్డను చూసి అందులో ఒకడు గబ, గబా వచ్చి పిల్లవాని కాళ్ళు పట్టుకుని లాగి మెట్ల దగ్గర పడేశాడు—ముష్టివాని పాత్రను గిరాటేసినట్టు.

ఆ బిడ్డ బురదలో పుట్టిన బిడ్డ వళ్ళంతా బురదే. వాసనే, అసహ్యమే. మరి ఆ ఛండాలపు బిడ్డ చక్కని మంచం మీద ఉండడమా!! కంపరమెత్తి పోదూ?

బురదలోంచి పుట్టిన ఏ పాపమూ, ఏ కల్మషమూ లేని ఆ పువ్వు లాంటి ఆ బిడ్డను చూడలేరు. కాని ఆ బురద లాంటి తల్లి కావాలి!

కామానికి కళ్ళుండవు గనుక శవాలతో నయినా సరసాలాడుతారు.

పసిబిడ్డ ఏడుపు..ఆ ఏడుపుకు అబాబుల చిరాకులు...

తలుపులు తెరుచుకున్నాయి.

ఆ బిడ్డ తల్లయితే బయటకు రాలేదు కాని, బయటున్న ఆ ముగ్గురు కుర్రాళ్ళు లోపల కెళ్ళారు.

బిడ్డ ఏడుపు...ఆ చీకటిని, ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తున్న ఏడుపు....

* * *

అందరూ చల్లబడ్డాక సత్యవతి బయట కొచ్చింది.

ఇంతవరకూ తనా బాబులకు శరీరాన్నిస్తే, ఆ ఆకలి రాక్షసులు ఆమెను విందు చేసుకుంటే...

ఆ బిడ్డను పొలాల నుండి వచ్చిన రెండు నక్కలు పీక్కు తింటున్నాయి!!

ఆ నక్కలను చూసి ఆమె గుండాగి పోయింది. కుప్పకూలి పోయిది.

అయినా నక్కలు పారిపోలేదు. అలా విందారగిస్తూనే వున్నాయి.

□□□

---

నిత్య నూతన ప్రయోగాలవల్లనే సాహిత్యం కూడా సైన్స్‌లాగే అభివృద్ధి చెందుతూంది. పాత ప్రక్రియలనే పట్టుకు కూర్చుంటే సైన్స్ అయినా, సాహిత్యమయినా స్తంభించిపోక తప్పదు.

—శ్రీ శ్రీ

తాత్కాలికమైన కొద్దిపాటి భద్రతకోసం, అత్యవసరమైన స్వేచ్ఛను వదులుకొనే వాళ్ళు స్వేచ్ఛకు కాని, భద్రతకు కాని అరులు కారు.

—బెంజామిన్ ఫ్రాంక్లిన్

కథానిక

# ధర్మం

మల్లాది వెంకట కృష్ణమూర్తి



నాకు దయానంద్ మీద ఒక స్థిరాభిప్రాయం ఉంది. చూస్తూ చూస్తూ అర్ధ రూపాయి ముష్టివాడికి దానం చేసే జాలి గుండె లేదు వాడికి. ఒక వాడిలోనే కాదు. నిజానికి నా లోనూ, నాకు తెలిసిన అనేక మందిలోనూ లేదా మంచితనం.

కాని దయానంద్ నేను చూసేలా జేబులోంచి అర్ధరూపాయి బిళ్ళ తీసి చూపు సరిగా ఆనని ఆ ముసలి బిచ్చగాడిబొచ్చెలో ఠంగుమనేలా వెయ్యడం నన్ను అమితంగా ఆశ్చర్య పరిచింది. సైనికుల మధ్య రాజులా, అయిదు, రెండు పైసలనాణాల మధ్య అదిఅందంగా అమరి ఉంటుందను కున్నాను.

ఎందుకింత ధర్మ బుద్ధి కలిగిందీ రోజు అని అడగ లేదు. నేను మౌనంగావాడి వెనకే నడిచాను పార్కుదాకా. వాడు ప్రపంచంలోని అనేక సంగతుల గురించి మాట్లాడాడు అనర్గళంగా, కాని అర్ధ రూపాయి ఎందుకు దానంచేశాడో చెప్పనే లేదు.

పార్కులో నేనే కొన్నాను వేరు సెనక్కాయలు. అరగంటదాకా రోజులా కూర్చున్నాం పార్కులో వేరు సెనక్కాయలు తింటూ. తర్వాత లేచి నెమ్మదిగా నడవసాగాం. అప్పుడైనా చెప్తాడేమోనను కున్నాను, కాని వాడు ఆ విషయమే ఎత్తలేదు. అడగాలనిపించినా నేను అడగలేదు.

తిరిగి వస్తుంటే, అదే దారి కాబట్టి, వెల్కంమ్ హోటల్ దగ్గర ఆ ముష్టివాడు తారస పడ్డాడు. వాడివైపు చూశాను. నెమ్మదిగా బెక్కుతూ ఏడుస్తున్నాడు. వాడి కళ్ళల్లోంచి నీళ్ళు వస్తున్నాయి. అంత పెద్దవాడు ఏడవటం నన్ను కించిత్ ఆశ్చర్య పరిచింది.

ఆ ముష్టి వాడి బొచ్చె పూర్తిగా ఖాళీ అయింది. రాజు వచ్చి సైనికులని యుద్ధం విరమించమంటే ఖాళీ అయిన యుద్ధ రంగంలా.

"ముష్టి వాడైతే మాత్రం ? కడుపు నిండా తిని సత్తు అర్ధ రూపాయా ఇచ్చేది? ఆ మాత్రం చూసుకోనక్కర్లా ? అయినా ఏ తలకు మాసిన వెధవంట సత్తు అర్ధ రూపాయలు దానం చేసేది?" హోటల్ కాషియర్ అరుపులు వద్దనుకున్నా మా చెవిన పడ్డాయి.

దయానంద్, దయానంద్ ప్రక్కనే నేను నిశ్శబ్దంగా నడిచాం, ఆ ముష్టివాడి ముందు నుంచి నేల చూపులు చూస్తూ.

***

కథానిక

# వితంతువు పాట్లు

*నంబూద్రి స్త్రీ (మలయాళ బ్రాహ్మణ స్త్రీ) వ్యభిచరించినట్లు అనుమానం కలిగితే ఆమెను ఒక గదిలో పెట్టి తలుపులు వేస్తారు. తలుపు వద్ద ఒక బ్రాహ్మణుడు కూర్చుని ఆమె ప్రియుని పేరు చెప్పమని కేకలేశాడు లేదా ఆమె తన నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకోవాలి. ఆమె దోషని తేలితే ఆమెను కులంనుంచి వెలివేశారు. ఇదీ కేరళలోని అచారం. రచయిత్రికి కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి యీ సంవత్సరం లభించింది (సం).*

వ్యభిచరించిన దనే అనుమానం మీద ఒంటరిగా గదిలోకి త్రోయబడిన ఆమె గది బయటనున్న పెద్దల నుద్దేశించి "నేను దోషిని, నన్ను వెలివేయండి, తప్పంతా నాదే, నే చేసిన పనికి యింకెవరూ బాధ్యులు కారు" అన్నది.

గది వెలుపల కూర్చున్న పురోహితులలో కలకలం బయలుదేరింది. ఈ ఆడదానికెంత పొగరు? గర్భవతిగా వున్న వితంతువు తన తప్పుకు ఎవరూ బాధ్యులు కారంటుంది! మరైతే గర్భవతెలా అయింది?

"నువ్వు వ్యభిచారిణివి, నీచురాలివి! ఇప్పుడయినా నిజం చెప్పలేవా?" అంటూ గర్జించాడు పురోహితుడు.

గదిలోంచి వెక్కి వెక్కి ఏడుస్తూ సన్నగా మాటలు వినవచ్చాయి,

"నా యీ తప్పుకు దోషి యెవరో నాకు తెలీదు. దేవుని సాక్షిగా చెబుతున్నాను. కారణం ఆ రాత్రి నేను ఒంటరిగా ఉండడమా? నా యవ్వనమా? అదివరకెన్నడూ ఎరగని ఏదో బలవత్తరమైన ఉద్రేకమా? నేను బాల వితంతువునని మీకు తెలుసు. నేను పన్నెండేళ్ళ బాలికగా వున్నప్పుడే నా తాళి తెగిపోయింది. తరువాత 20 ఏళ్ళు గడిచాయి. నా జీవితం నిష్కళంకమైనది. నన్నెవరైనా వేలుపెట్టి చూపించారా? నేనెప్పుడైనా ఆచార విధులను, పూజాపునస్కారాలను నిర్లక్ష్యం చేశానా? గురువయ్యూర్‌ను (విష్ణువు) సేవించడంలో ఎప్పుడయినా అశ్రద్ధ చేశానా? మరి ఆ ఒక్క రాత్రి భగవంతుడు నా మతి ఎందుకు చెడగొట్టాడు? నా జీవితంలో నా తండ్రితో తప్ప మరెవ్వరితో నే మాట్లాడలేదు.

రచన: లలితాంబికా అంతర్జనం * అనువాదం: శ్రీమతి బి. హృదయకుమారి

పురుషుని గురించిన ఆలోచనే నన్ను భయపెట్టేది. స్త్రీకి ఒకే పురుషుని గురించి తెలియాలి. నాకు అలాంటి పురుషుడు లేడు.

"వంటిల్లే నా ప్రపంచం! నా గది లోంచి నేనెప్పుడూ బయటికి తొంగి చూడలేదు. మరైతే యిదెలా జరిగిందని మీరనవచ్చును! చెప్తాను వినండి...."

బయట కూర్చున్న పెద్దలు ఆశ్చర్య పోయారు. ఈ వ్యభిచారిణి తన తప్పును ఎలా సమర్థించుకోగలదు? "సరే నువ్వన దలిసిందేమిటో వేగం చెప్పు" అంటూ ఆదేశించాడు పురోహితుడు.

"మీరంతా ఆనాడు విందుకు వచ్చారు కదా! అలాంటి పెళ్ళి సంబంధం ఎందుకు నిశ్చయించారు? ఆ కుటుంబంలోని పెద్ద కొడుకు కూతురు, ముప్పయి ఏళ్ళ పడు చును నా తండ్రికి, పదకొండేళ్ళ మూడు మాసాల వయసుగల నన్ను ఆ ముసలా డికి యిచ్చి పెళ్ళి చేయడానికి నిశ్చ యించారు. ఇద్దరు తండ్రులు ఒకరి కూతుర్నొకరు పెళ్ళాడేరన్నమాట.

"అయితే నేను అత్తగారింట్లో ఎంతో కాలం వుండవలసిన అవసరం లేకపోయింది. నా సవతి తల్లి, అంటే నా భర్త కుమార్తె, ఇబ్బుమనిషి. ఆమె పోయింది. నేను నా భర్తకు బరు వయ్యాను, నేను కన్నవారింటికి వెళ్ళి పోయాను.

"నేను భర్తను ఒక్కసారే చూశాను. అతని నెరసిన గెడ్డం, పెద్ద పొట్ట చూసి నేను జడుసుకోలేదు. ఆశ్చర్యపోయాను. నేనెప్పుడూ అతని గదిలోకి వెళ్ళలేదు. అతనికి తన కులానికి చెందిన నలుగురు భార్యలు, బయట నలభైమంది వుండే వారు, అందుచేత నన్ను చూడడాని కెప్పుడూ రాలేదు.

"ఓణమ్ పండుగ రోజుల్లో ఒకనాటి మధ్యాహ్నం నేను వీధి వాకిట్లో స్నేహితు రాళ్ళతో ఆడుకుంటూండగా ఎవడో వచ్చి మా నాన్న చెవిలో ఏదో కబురుచెప్పేడు. మా నాన్న ఆ కబురు రహస్యంగా మా అమ్మకు చెప్పేడు. మా అమ్మ ఏడుస్తూ గుండెలు బాదుకుంది. చుట్టుపట్ల వాళ్ళు మా అమ్మచుట్టూ మూగేరు. గదిలోంచి ఏడుపులూ మొత్తలూ వినిపిస్తున్నాయి. నా కేడుపు రాలేదు. ఎందు కేడవాలో నాకు తెలీదు. నన్ను తీసుకెళ్ళి స్నానం చేయించారు, గాజులు తీసివేశారు, నా బొట్టు చెరిపివేశారు.

"మా యింటి పెద్ద కోడలు వచ్చి నా తాళి తీయబోయింది. నేను తీయ వద్ద న్నాను. ఇంతకంటె మంచి గొలుసు కొంటాను నీకు అది ఇచ్చేయమ్మా" అన్నాడు మా నాన్న. అపర కర్మలు పూర్తి అయేక నాకు మా నాన్న కొత్త బంగారపు పూసలగొలుసు కొని ఇచ్చాడు. అది ఎంతో బావుంది. ఆనందంతో నా మనస్సు నిండిపోయింది. బంగార పు పూసల గొలుసుకూ తాళికీ వ్యత్యాసం తెలి యని అమాయకపు బాల్యదశలో నే ఎప్పుడూ వుండిపోతే ఎంత బావుండును.

క్రమంగా మారిన జీవితానికి అల వాటు పడ్డాను. నేనెలాంటి బట్టలు కట్టు కోవలసిందీ, ఎలా ప్రవర్తించవలసిందీ మా బామ్మ నాకు బోధించింది. ఆ రోజుల్లో నే నామె ఒళ్లో పడుకుని ఆమె చెప్పే గోపికా కృష్ణుల గాధలను వినేదాన్ని.

# దివంగత

వెలుతురు పాపని చూసి
ముద్దొచ్చి ఎత్తుకుంది కిరణం...
ఆకాశం అంచున నిలచి
అదిగోమ్మా భూమి
అంటూ చూపింది.
కేరింతలు కొడుతూ పాప
పుడమికి జారింది
"అయ్యో అయ్యో"
వాళ్ళ నాన్న సూరీడికి
ఇదెలా చెప్పేదీ....
అనుకుంటే....
గుండె పగిలిన కిరణం
దివంగతం అయ్యింది....

*పి. పద్మజవాణి*

---

"రోజూ తెల్లవారు ఝామునే లేచి స్నానం చేసి, పూలమాలలు కట్టి, దీపాలు వెలిగించి, విగ్రహాలకు అభిషేకం చేసే దాన్ని. అక్కడి విగ్రహాలన్నిటిలో విష్ణు, లక్ష్మి విగ్రహాలే నాకెంతో నచ్చేయి. విష్ణుమూర్తి ప్రేమ స్వరూపుడుగా నాకు కనిపించేవారు. శంఖుచక్ర సమన్వితమైన తన చేతులతో ఆయన చిరునవ్వుతూ లక్ష్మీదేవిని తన గుండెలకు హత్తుకునే వారు. ఆయన ముఖ వర్చస్సు నాకు ఉద్వేగం చేసేది. ఆ విగ్రహాన్నే నేను తోమి, పూలమాలలతో అలంకరించే దానిని. ఆయన నుదుటికి చందనం పెట్టే దానిని. నన్ను నేను అలంకరించుకోవా లనే కోరిక, ఎన్నడూ నెరవేరని నా కోరి కను, విగ్రహాన్ని అలంకరించి తీర్చుకునే దాన్ని. అది నా పూజా విధానంలో భాగ మైంది.

ఏ ఉదయపు తొలి వెలుగుల సమయం లోనో, ఏ సాయంత్రపు మసక చీక టుల వేళలోనో ధూపదీపాల వెచ్చ దనంలో పూజా పుష్పాల సువాసనల మధ్య నా ప్రేమైకదైవం ముందు మోక రిల్లినప్పుడు, ఆ పుష్పాలలో కొన్నిటిని నేను పెట్టుకోకూడదా, ఆ చందనం నేను కొద్దిగా ధరించకూడదా అనే చిరు కోరిక నాలో మెదిలి, నామనస్సును వ్యధాపూరితం చేసేది. లేదు. కాలిపోయిన నా ఆశల భస్మం తప్ప నే నింకేమీ ధరించ కూడదు.

"ఏళ్ళు గడిచాయి. నాకు యుక్త వయసు వచ్చింది. స్నానాలు పూజలు, జపాలతో నా రోజులు గడిచిపోతు న్నాయి. నా పెద్దన్నకు వివాహమైకోడలు ఇంటికి వచ్చింది. నా వదిన ఎందుకంత అందంగా వుంది? ఎందుకంత ఆనందంగా వుంది?

జరీచీర కట్టుకుని పువ్వులు పెట్టుకుం టుంది. అదివర కెన్నడూ నేనెరగని ఒక జీవిత దృశ్యం నా కళ్ళ ముందు రెక్కలు విప్పుకుంది, ప్రతి రాత్రీ పెద్ద చప్పుడుతో వాళ్ళ గది తలుపులు మూసుకునేటప్పుడు- నన్ను మన్నించండి, నా మీద కోపగించ కండి, నాలో వున్న వేదన వల్లనే నేవి దంతా చెప్పవలసి వస్తూంది. అంతే కాని ఈర్ష్యవల్ల కాదు. నాకు ఎవరిపట్లా

అసూయ లేదు. కాని నా బతుక్కూ ఆమె జీవితానికి ఎంత వ్యత్యాసముందో తలచుకుంటే నా గుండె చక్కలయ్యేది.

"వితంతువు కన్నీటిని చూసి భయపడదు, కాని ఆనందంగా నవ్వితే భయపడుతుంది. ఎవరు వుల్లాసంగా వున్నా సరే ఆ ఆనందం ఆమె హృదయాన్ని గాయపరుస్తుంది. పూజ్యులైన బ్రాహ్మణులారా, అదెలా గాయపరుస్తుందో, ఎలా గుండెను కాల్చివేస్తుందో మీరు అర్థం చేసుకోగలరా? మీ అంతరాంతరాల్లో నెమ్మదిగా మండే యీ అగ్నికీల వుంటుంది.

"నాకూ నా వదినగారికీ పడింది కాదు. అనేక కారణాలుగా పోట్లాడుకునేవాళ్ళం. నా స్థితి అధ్వాన్నమైంది నేను ఆ ఇల్లు వదిలి నా భర్త యింటికి వెళ్ళిపోయాను.

'నా సవతులకు ఆరుగురో ఏడుగురో కూతుళ్ళు వయసులో వున్నారు కాని పెళ్ళిళ్ళు కాలేదు. అందులో నలుగురు నాకంటె పెద్దవాళ్ళు ఆ ఇంటిలో పది మంది పిల్లలుండేవారు. నేనా మందలో ప్రవేశించాను. శిధిలావస్థలో వున్న ఆ ఇంట్లో ఆకలివల్ల, అణగారని కోరికల వల్ల వెలువడే నిట్టూర్పులు, ఏడుపులు తప్ప మరేమీ వినిపించేవి కావు. కాని అది నా ఇల్లు. నా కక్కడ హక్కువుంది.

నా సవతుల సూటిపోటు మాటలు బండబారిన నా మనసును గాయపరచలేకపోయేది. నేను గట్టిగానే జవాబిచ్చేదాన్ని. నాకు పిల్లలు లేరు, బాధ్యతలు లేవు. పిల్లలులేని వితంతువుకు దయాగుణమంటే ఏమిటో తెలీదు. మేము బతుకుతున్నాం, చావలేము కాబట్టి బతక్క తప్పదు.

'నేను ఉపవాసాలూ దీపారాధనలు చేసేదాన్ని. ఆ రోజుల్లో నన్నంతా సన్న్యాసిని అనేవారు. ఎంత త్వరలో ఆ మంచి పేరు మట్టిగలిసిపోయింది! నేను దొంగ సన్న్యాసినిఅని బహుశా మీరు నన్ను నిందించవచ్చును, మీ ఇష్టమొచ్చినట్టు అనండి, వెక్కిరించండి. కాని నేనొకటి అడుగుతాను. మీరు నీతి నియమాలకు సంరక్షకులమని చెప్పుకుంటారు. జీవితమంటే ఏమిటో తెలియని ఈ దురదృష్టవతనిల రక్షణకు మీరేమాత్రమైనా ప్రయత్నించారా? ఈ లోకం మా కోసం కాదని మీరు తీర్మానించారు. అణచివేయవీలులేని ఆశలు, అదుపులోకి రాని వుద్రేకాలు-ఇది మానవసహజమైన వాంఛతో కూడిన జారుడు మెట్లు. ఈ మెట్లమీంచి కొద్దిగా జారితే కఠినాత్ములైన పురోహితులు మమ్మల్ని శిక్షించి అగాధంలోకి త్రోసివేస్తారు. భగవంతుడా! నన్ను ఇందులోంచి ఏదీ కాపాడలేదా? గురువాయూర్ కాని, వడకునాథన్ గాని (శివుడు) నా ఉపవాసాలు, జపతపాలు గాని నన్ను రక్షించలేవా?'

గదిబయట బ్రాహ్మణులు నిశ్శబ్దంగా వింటూ కూర్చున్నారు. ఆమె మళ్ళీ చెప్పడం ప్రారంభించింది.

"ప్రతి ఏటా కోవెలలో భాగవత పారాయణ జరిగేది. బ్రాహ్మణ స్త్రీలు వినడానికి వెళ్ళేవారు. మేము వెళ్ళడం కేవలం పవిత్ర వాంఛతో మాత్రమే కాదు. మాకు బయటికి వెళ్ళాలనుండేది దొంగతనంగా పురుష కంఠం వినాలని వుండేది. నిస్పృహతో నిండిన వితంతువులు, బాధలు పడే ఇల్లాళ్ళు, వయసు ముదిరిన

## సలహా

ఓటు పెట్టెలో
ఒడ్డెక్కిందిట విప్లవం!
దక్షిణం దారి మరిచిందేమో
తక్షణం వెళ్ళి పిలుచుకు రండి

నయానో భయానో
నియంత కే వంత పాడిన
వంది మా గధుల్లారా
ఎండ మారింది
గొడుగు మార్చండి!

*టి. ప్రసన్నకుమార్*

---

అవివాహితలు అంతా కోవిలలో చేరే వారు. బాధలు, కన్నీళ్ళు, నిట్టూర్పుల సమాగమ మది.

"మా ఇల్లు కోవిలకు దగ్గరలోనే వుండేది. నేను రోజూ తెల్లవారగట్ల లేచి స్నానం పూజ ముగించుకుని కోవిలలో భాగవతం వినడానికి కూర్చునే దాన్ని.

"భాగవతం చదివే ఆయన సన్యాసి కాడు, వృద్ధుడూ కాడు. ఆయనకు ముప్పయి అయిదేళ్ళవయసుంటుంది, తెల్లగా, బలంగా వుండేవాడు. ఆయన ముఖవర్చస్సు, కళ్ళల్లో తేజస్సు అందరినీ ఆకట్టుకొనేవి. అక్కడికి వచ్చిన స్త్రీలందరూ అతనిని శ్రీకృష్ణ భగవానుని అవతారంగా భావించే వారు.

అతని వాగ్ధాటి, సునిశిత హాస్యము, కంఠ మాధుర్యము అందరినీ ఎంతో ఆకర్షించేవి. గోపికలతో శ్రీకృష్ణుని లీలల గురించి చదువుతున్నప్పుడు అతనిలోని వుత్సాహం పొంగి పొర్లేది. అనిర్వచనీయమైన అనురాగప్రవంతికి మించిన దేదీలేదు క్రిష్ణభగవానుని కథలో దశావతారాల గురించి గాని, యింక దేని గురించైనా గాని మరచి పోవచ్చును కాని గోపికలపట్ల ఆయన ప్రేమను మరచి పోలేము, మనోహరమైన బృందావన లీలలు శతాబ్దాలు దాటి యీ నాటికీ మనల్ని చేరి, ప్రేమామృతంలో ముంచి వేస్తున్నాయి. ప్రేమే జీవన్ముక్తి, ప్రేమే ఆనందం. అయితే ప్రేమసాఫల్యం అంటే ఏమిటి?

భాగవతారు ప్రేమ స్వరూపురుడిలా కనిపించాడు. ఒక క్షణంపాటు చదవడం నిలిపి మావేపు చూశాడు. నేను ముందు వరసలోనే కూర్చున్నాను. నేను గతుక్కుమన్నాను. నా గుండె దడదడ కొట్టుకుంది. నాకు సిగ్గు భయమూ కలిగాయి. అతను నన్ను చూశాడా? నేను తల దువ్వుకోలేదు, నేనెంతో వికారంగా కనిపించి వుంటాను.

"నేనింటికి వెళ్ళి అద్దంలో నా మొహం చూసుకున్నాను. నన్ను నేను చూసుకుని ఎన్నాళ్ళయిందో. శ్రీకృష్ణునికి దూరమై, వియోగ బాధవల్ల సౌందర్యవతి అయిన రాధ ముఖం పాలిపోయినట్లుగా, విచార గ్రస్తమై పాలిపోయిన నా మొహంలో ఏదో కొంత వింత సౌందర్యం తొంగి చూడడం లేదా?

"నేను రోజూ స్నానంచేసి తలదువ్వుకుని, పూజాపుష్పాలు తలలో పెట్టుకుని కోవిలకు వెళ్లేదానిని. ఆ రోజు ద్వారం

వద్దనే నిల్చొని సహస్ర నామాలు ఉచ్చరిస్తున్నాడు. ఎంత మధురమైన కంఠం! అతని వేపు చూశాను. అతనూ నన్ను చూస్తున్నాడు. నా కాళ్ళు తడబడ్డాయి. నేను దైవార్చన పూర్తి కాకుండా నే ఇంటికి వచ్చేశాను రోజూ భాగవత పారాయణకు వెళ్ళేదానివి. కాని సర్వ వేళల్లోనే ఆ భాగవతారు నా కళ్ళలో మెదిలేవాడు. అతనిని మరువలేక పోయే దానిని. అతి సుందర యమునా నదీ తీరాన కదంబ వృక్షచ్ఛాయలో ప్రేమోద్వేగంలో రాధ, క్రీడానందంలో మునిగి తేలే శ్రీకృష్ణుడు. ఆయన యీ భాగవతార్ లాగే నవ్వుతూ అందంగా వుండేవాడా?

"మాఘమాసంలో నేను తెల్లవారు ఝామున కోవెల తటాకంలో స్నానం చేసి నిర్మాల్య పూజా సమయంలో దైవారాధనలో నిమగ్నమయే దానిని. ఇటీవల నేను స్నానానికి వెళ్ళినప్పుడు ప్రక్కను కొద్ది దూరంలో ఎవరో దైవకీర్తనలు పాడడం వినిపించింది. నాలాగే ఎవరో వంటరిగా స్నానం చేసేవారు.

ఆరోజు మాఘమాసపు వెన్నెల చూసి తెల్లవారిందనుకుని హడావిడిగా చెరువుకు పరుగెత్తేను. గబగబ స్నానం చేసి తల ఆరబెట్టుకున్నాను. అప్పుడు చంద్రుడు పశ్చిమాన దిగిపోతున్నాడు.

"నేను భాగతం వింటూండడం వల్ల కావచ్చు నా మనస్సులో కవితాభావన పెల్లుబికింది. యమునా నదీ తీరాన ఆ మనోహరమైన రాత్రులు కూడా యీ రాత్రి వంటివేనా? శతాబ్దాల క్రితం ల తియ్యని ప్రేమగానం ఆ నదీ తీరా ఆ నుండి పైకి లేచింది. ఆ గానం యుగాలు దాటి, యీనాడు ఇక్కడికి చేరి కృశించిన నావంటి అభాగ్యులపై ప్రేమామృతాన్ని చిలికి ఆశలు చిగురింప జేస్తున్నది. తన్మయీ భావంతో నన్ను నేను మరచి ఒక అష్టపది గానం చేశాను.

"కొన్ని సందర్భాలలో కొన్ని పరిస్థితులలో నువ్వు ఎంత వద్దనుకున్నా మనసు స్వాధీనం తప్పి పోతుంది. అది మానవునిలోని బలహీనత. మీవంటి మహనీయులకైనా అంతే. అలాంటప్పుడు నావంటి సామాన్య స్త్రీని మీరు ఎలా నిందించగలరు? అలాంటి స్వాప్నిక స్థితిలో కూడా వెనుకనుండి నన్ను రెండు వెచ్చని చేతులు కౌగలించుకున్నప్పుడు నేను అదిరిపోయాను. ఎవరది? భగవానుడా? భక్తులకు దర్శనమిస్తాడట. కాని తెలివి తెచ్చుకున్నాను. కాదు కలియుగంలో భగవంతుని దర్శనం కాదు. అయితే మరెవరు? నాలోని ఆవేదన వెలుపలికి రాకుండా నా పెదవుల మీద ముద్దు ఉద్రేక స్రవంతిలో నా ప్రతిఘటన ఓడిపోయింది. నేనెన్నడూ ఎరగని ఏదో మధురానుభూతి. అది తన్మయీ భావమా? అది నిద్ర కాదు. కల కాదు. ప్రకృతితో పోరాటంలో నేను ఓడిపోయాను. అదే పాపమైతే దానిని స్వీకరించి దానికి బదులు జీవితమంతా ధార పోస్తాను.

"ఆ సమాగమం మళ్ళీ జరిగిందా అని అడక్కండి. ఆ దేవుడెవరో తెలుసుకోడానికి ప్రయత్నించకండి. నేనుదోషిని. నన్ను శిక్షించవచ్చు. నా తప్పుకు ఎవరూ బాధ్యులు కారని మళ్ళీ చెప్తున్నాను."

□□□□

# తుఫానును జయించిన మనీషి

*

మహీధర రామశాస్త్రి

డా॥ సరస్వతుల సూర్యనారాయణ గారు కోనసీమలోని ముంగండ వాస్తవ్యులు. 70 ఏళ్ళ వయసు. ఆయన యీమధ్య మృత్యుముఖం నుంచి అత్యద్భుతంగ తప్పించుకొన గలిగారు.

మొన్నటి తుపాను రోజున విశాఖ బయలు దేరారు. తోబుట్టువు ఇంటో వివాహానికని నూతన వస్త్రాలు సంచిలో వేసుకుని బయలు దేరారు ఒంటరిగా. బస్సులు, రైళ్ళు రద్దయినందున అతి కష్టం మీద అనకాపల్లి దాకా చేరారు. అక్కడ శారదా నది పొంగి వంతెన మీంచి పొరలుతూంది. వాహనాలు ఆగిపోయాయి. కొందరు సాహసించి, నీట్లో దిగుతున్నారు. ఈయన కూడ పంచె ఎగగట్టి నీటిలోదిగారు. వంతెనమధ్యకు వెళ్ళేసరికి, గాలి వేగానికి, నీటి తాకిడికి, కాలు జారి, శారద మీద పడ్డారు.

ఎలాగో మునిగి పోకుండా తలను కాపాడు కుంటూ, నిలువు యీత మీద అయిదారు మైళ్ళు సాగారు. మెడకి తగిలించుకున్న నూతన వస్త్రాల సంచీ శారదకి అర్పించారు. కట్టుకున్న ఖద్దరు బట్టలు నాని బరువెక్కి ప్రాణాంతకం అవుతూంటే, వాటినీ విసర్జించారు.

పాక ఏదో కొట్టుకు పోతూంటే దాని ఆసరాకోసం చేయి చాపారు. ఈయన కన్నా ముందే దాన్ని ఆశ్రయించిన విషనాగులు నాలుకలు చాపుతూ కనిపించాయి. పెనంమీంచి పొయ్యిలో పడ్డం యిష్టంలేక అలాగే ముందుకు సాగారు.

సూర్యుడు అస్తమించాడు. చీకటి పడుతూంది. ఈయన కోసమేనా అన్నట్టు ఓ వేప చెట్టు దొరికితే, దానిమీద ఎక్కి రాత్రంతా ఏకాంతంగా, నగ్నంగా, చలిలో నీటి మధ్య ఏటి మధ్య గడిపారు.

వెలుగు వచ్చినా, నీటి ధాటి తగ్గలేదు. మధ్యాహ్న సమయంలో అంటే 20 గంటల తరవాత, ఏటి మీదకి వేటకోసం వచ్చిన బెస్తలను చూసి గట్టిగా అరచి పిలిచారు. వాళ్ళు చాకచక్యంగ, ఈయనను ఎలమంచిలి ప్రాంతం చేర్చారు. బెస్తలే బనీను చింపి గోచీగ యిస్తే కౌపీనధారులై దూరపు బంధువుల యింటికి వెళ్ళి అక్కడనుంచి విశాఖ కబురంపి బంధువుల సహాయంతో వారం తర్వాత తిరిగి ముంగండ ముఖం చూశారు.

మా నాన్న గారిమధ్య వ్రాసిన లేఖవల్ల యీ ఉదంతం తెలిసింది.

తాజాకలం:

డాక్టరుగారు ఎక్కిన వేపచెట్టు రోడ్డుకు కొద్దిదూర లోనేవుందనీ, ఆయన పెడుతున్న కేకలు రోడ్డు మీదకి వినపిస్తున్నా వాటిని పట్టించుకున్న వారిలో కొందరు ఆయనను బయటకు తేవడానికి సౌంజ్ఞలతో డబ్బు బేరం ఆడారనీ 'అభ్యుదయకు యింకొకరి ద్వారా వార్త అందింది.

□□□□



# కళాతపస్వి

వెకిలిగా నవ్వుతూ, వెర్రిమొర్రి చేష్టలు చేస్తూ, రచయిత రాసి బట్టీ పెట్టించిన డైలాగులు ఒప్పజెప్పుతూ, ప్రేక్షకుల్ని కాసేపు నవ్వించి, రంగంనుంచి తప్పుకొనే హాస్యగాళ్ళు, విదూషకులు, ఒప్పున్న నాటకాల్లో, సినిమాల్లో, సర్కసుల్లో చాలామందే కనిపిస్తారు చార్లీ చాప్లిన్ అలాంటి హాస్యగాడు కాదు. హాస్య రసాన్ని ఒక ప్రయోజనాత్మకమైన కళగా సాధనచేసి దాన్ని అత్యున్నత శిఖరాలకు చేర్చిన మహనీయ కళాతపస్వి ఆయన.

అమెరికా చలనచిత్ర పరిశ్రమలో మూగ చిత్రాల యుగం యించుమించుగా చాప్లిన్‌తోనే ఆరంభమై, చాప్లిన్‌తోనే ముగిసిందని చెప్పవచ్చు. ఆనాటి చిత్రాల్లో తమాషా అయిన హ్యాటూ, పైజమాలాంటి వదులు పంట్లాం, అడుక్కొని వచ్చి తొడుక్కున్నట్లుండే పెద్దసైజుబూట్లూ వేసుకొని స్వంతమార్కు చేతికర్ర ఊపుతూ దైన్యం ఉట్టిపడే మొహంతో, కొండంత విషాదాన్ని గుండెల్లో దాచుకొని, బ్రతుకు బండి నీడుస్తూ, పల్లెత్తు పలుకు పలక్కుండానే, తాను నవ్వకుండానే, ప్రేక్షకుల్ని కవ్వించి నవ్విస్తూ, బ్రతుకు బాటలో ఆశాజ్యోతులు వెలిగిస్తూ, చాప్లిన్ ధరించిన దేశదిమ్మరి హాస్య పాత్రలు జనాన్ని వుర్రూత లూగించి, ఆ చిత్రాల్ని శాశ్వత కళాఖండాలుగా చేశాయి.



## ఆత్మకథలో సు

ప్రజాతంత్ర వాదులను, శాంతికాముకులను, భిన్నవాదులు ఎవరినైనా సరే "కమ్యూనిస్టు" అని ముద్రవేసి వేపుకు తినడం "అమెరికా ప్రజాస్వామ్య వ్యవస్థ"లో చాలా కాలంగా జరుగుతూ వుంది. అణ్వస్త్రాలను వ్యతిరేకించిన ఘోర నేరానికి కమ్యూనిస్టు *గూఢచారు*లని ఆరోపించి *రోజెన్‌బర్గ్* దంపతులను ఉరికంబ మెక్కించారు. నీగ్రోల హక్కుల కోసం పోరాడిన అంగెలా దేవిస్‌ను అమెరికా వ్యతిరేకి

అంటూ నానాపాట్లు
ప్రసిద్ధుడైన వస్త్రా
త్నం యుద్ధంలో
దుకు ఎన్నో అగ
చార్లీ చాప్లిన్‌కూ

"అన్ అమెరి
విచారణ కమిటీ"
బూనుకొంది. కాని
పోవుడు కావడంలే
పోయింది. "పత్రికా
అని చెప్పుకొనే అ



# చార్లీ చాప్లిన్

లండన్‌లో సామాన్య రంగస్థల నటుడుగా జీవితం ప్రారంభించి, 21 సం॥ల వయసులో, 1910 లో అమెరికా సినిమారంగంలో ప్రవేశించిన చాప్లిన్ ఎన్నడూ సినిమా టెక్నిక్కుల చమక్కులకు దాసోహమన్నవాడు కాదు. తన నటనా కౌశలం లోనే ఉన్నత కళాశిఖరాల నందుకున్నాడు. అభినయానికి ఆయన ప్రాధాన్యమిచ్చాడు. దానికి లోపం వస్తుందనే అభిప్రాయంతోనే అతడు కొంతకాలంపాటు, మాటల సినిమాలొచ్చిన తరువాత కూడా వాటి జోలికి పోకుండా వూరకున్నాడు. 1914 లో మొదలుపెట్టి 1957 వరకు ఆయన దాదాపు 80 చిత్రాల్లో నటించాడు. ఇతరులు తీసిన చిత్రాల్లో వేషాలు వేయడమేగాక, తాను స్వయంగా పలు ఉత్తమ చిత్రాలు తీశాడు. ఆయన వాటికి కథ, మాటలూ, పాటలూ తానే రాశాడు. బెర్నార్డ్ షా అంతటివాడు ఆయన్ను "ప్రపంచ చలనచిత్ర రంగం సృష్టించిన ఏకైక మేధావి" అని కొని యాడారు. విమర్శకులు ఆయన్ను మేటి నటుడు, దర్శకుడు అని ప్రశంసించారు.

చాప్లిన్‌ను మహానటుడు, గొప్ప దర్శకుడు అని ఒక చెంప మెచ్చుకొంటూనే, బూర్జువా పత్రికలు ఆయన తన కళ ద్వారా సాధించ తలపెట్టిన ప్రయోజనాన్ని మరుగుపుచ్చేందుకు సకల విధాలా ప్రయత్నించాయి.

ఆయన సినిమాలు తీసి డబ్బు చేసుకున్నా, ఏనాడూ కళ కళకోసమే, హాస్యం

## చి ఒక ఉదంతం

పెట్టారు. ప్రపంచ మొహమ్మదాలీని వియ చేర నిరాకరించినం చాట్లకు గురిచేశారు. ఇది తప్పలేదు.

కన్ కార్యకలాపాల అతణ్ణి విచారించ అతడు బ్రిటిష్ ఆ పని చేయలేక స్వేచ్ఛకు" ప్రతీక మెరికా గుత్తపత్రికలు

ఆయన మీద కత్తికట్టాయి. 1947 లో తాను నిర్మించిన "మున్షే వెర్డో" అనే చిత్రాన్ని విడుదల చేసేందుకు న్యూయార్క్ వెళ్ళినప్పుడు జరిగిన కింది ఉదంతాన్ని చాప్లిన్ తన ఆత్మకథలో రాసుకొన్నాడు.

ఆయన న్యూయార్క్‌కు చేరిన మరు క్షణమే "డైలీ న్యూస్" పత్రిక అతడి మీద దాడి ప్రారంభించింది. అతణ్ణి కమ్యూనిస్టు "అనుయాయి" అంది. గుండెలుంటే, అమెరికా పత్రికా విలే



హాస్యం కోసమే అని భావించలేదు. "ది కిడ్" (పసివాడు), 'సిటీ లైట్స్' (నగరం వెలుగులు), 'గోల్డ్ రష్' (బంగారం పిచ్చి), 'మాడరన్ టైమ్స్' (మన కాలం) వంటి చిత్రాల ద్వారా ఆయన మానవత్వం లోపించిన పెట్టుబడిదారీ నాగరికతను, ధనస్వామ్యపు కపట విలువలను దుయ్యబట్టాడు. 'ది గ్రేట్ డిక్టేటర్' చిత్రం ద్వారా ఫాసిజం నగ్న స్వరూపాన్ని చాటిచెప్పాడు. ఆయన చిత్రాలన్నిటిలోనూ అంతర్వాహినిగా గోచరించేవి ఉదాత్త మానవతా, ఆశాభావమూ.

88 సంవత్సరాల పండు వయసులో 1977 డిసెంబర్ 25 న స్విట్జర్లాండులో వెవీ అనే చిన్న గ్రామంలో, స్వగృహంలో కన్నుమూసిన హాస్యకళాతపస్వి చార్లీ చాప్లిన్ 1889 లో లండన్‌లో శ్రమజీవులైన ఒక కళాకారుల కుటుంబంలో జన్మించారు. ఆయన తండ్రి ప్రతిభావంతుడయిన కళాకారుడూ, కొంతవరకు మంచి ఆర్జనపరుడూ ఐనప్పటికీ సపాదించినదంతా తాగుడుకింద తగలేసేవాడు. చార్లి తల్లి కడుపున వుండగా, అతడు భార్యనూ, ఒక కొడుకునూ విడిచిపెట్టి దేశాలు పట్టిపోయాడు. నటి, గాయకి అయిన చార్లీ తల్లి తన బిడ్డలిద్దరినీ కష్టపడి పెంచింది. దుర్భర దారిద్ర్యం భరించలేక ఆమె చివరకు పిచ్చిదైపోయింది. పిల్లలిద్దరూ అనాధ శరణాలయం పాలై నానా అగచాట్లు పడ్డారు. వాళ్ళు శ్మశాన వాటికల దగ్గర బిచ్చమెత్తుతూ కొంతకాలం పొట్టపోసుకొన్నారు. చివరకు వాళ్ళు చెరో దారి పట్టారు.

---

కరులను సమావేశపరచి, తమ ప్రతినిధి అడిగే ప్రశ్నలకు జవాబివ్వాలని సవాల్ చేసింది.

ఈ చిత్రాన్ని నిర్మించిన "యునైటెడ్ ఆర్టిస్ట్స్" కంపెనీ ప్రచార విభాగం వారితో సంప్రతించి, చాప్లిన్ మరుసటి రోజున అమెరికా పత్రికా విలేకరుల గోష్టి ఏర్పాటు చేశారు. కొందరు తనను అల్లరిపెట్టడానికే అక్కడికి వచ్చారని అయన గ్రహించారు.

"మహాశయులారా, మీ అందరికీ స్వాగతం. నా చిత్రం గురించి, యిక ముందు నా పథకాల గురించీ మీ రేమైనా తెలుసుకోవాలనకొంటే అడగండి, చెబుతాను."

ఎవరూ మాట్లాడలేదు "దయచేసి అంతా ఒక్కసారే మాట్లాడకండి" అన్నారు. ఆయన చిరునవ్వుతో.

చివరకు ఒక మహిళా పత్రికా విలేకరి "మీరు కమ్యూనిస్టా?" అని ప్రశ్నించింది

"కాదు" అని ఖండితంగా సమాధానమిచ్చి, "అ తరువాత ప్రశ్న" అన్నారు చాప్లిన్. తన్ను సవాల్ చేసిన "డైలీ న్యూస్" ప్రతినిధి ఏమన్నా అడుగుతాడని చాప్లిన్ అనుకొన్నాడు. కాని, అతగాడి జాడే కనిపించలేదు ఒక వింత వ్యక్తి ఎవరో ఏవో ప్రశ్నలడిగే ధోరణిలో తాను రాసుకొచ్చింది చదవనారంభించాడు

"క్షమించండి మరోసారి చదవండి. నాకు ఒక్క ముక్క కూడా బోధపడలేదు" అన్నాడు చాప్లిన్.

"కాథలిక్ పోరాట యోధుల సంఘానికి చెందిన మేము...."అంటూ పృచ్ఛకుడు ఏదో చదవబోయాడు.

చార్లీ మొట్టమొదట ఐదేళ్ళ వయసులో ఒక నాటకంలో ఏవో పాటలు పాడి హాస్యం నటించి రంగస్థలంపైకి వచ్చాడు. ఆ తరువాత 'షెర్లాక్ హోమ్స్' అనే అపరాధ పరిశోధక నాటకంలో వేషాలు వేసి ప్రేక్షకుల, విమర్శకుల మన్నన సంపాదించాడు. ఒక సర్కస్ కంపెనీలో బఫూన్‌గా పనిచేస్తూ అమెరికా వెళ్ళాడు. 1914 లో అప్పుడప్పుడే ప్రారంభ మవుతున్న అమెరికా చలన చిత్రరంగంలోకి ప్రవేశించాడు. అక్కడే అతడు స్వయంకృషితో, సొంత ప్రతిభతో నటుడుగా, అగ్రశ్రేణి దర్శకుడుగా, చివరకు నిర్మాతగా వృద్ధిలోకి వచ్చాడు.

1950 దశకం ప్రారంభంలో ఆయనకు అమెరికా సినిమా ప్రపంచంలో శత్రువులు ఎక్కువయ్యారు. ఆయన ఉదారవాద, స్వతంత్ర భావాలకు "కమ్యూనిజం" ముద్ర వేసి అతణ్ణి వేపుకు తిన నారంభించారు. తరవాత స్వదేశమైన ఇంగ్లండు చాప్లిన్ వెళ్ళినప్పుడు అమెరికా ప్రభుత్వం అతని పాస్‌పోర్టు రద్దుచేసి, ఆ విధంగా ఆయన ఆ దేశంలో అడుగు పెట్టకుండా నిషేధించింది. చివరకు ఆయన 1952లో స్విట్జర్లాండు వెళ్ళి అక్కడే స్థిరపడిపోయాడు. వృద్ధాప్యంలో తాను స్వయంగా చిత్రాలు తీయకపోయినా, నటించకపోయినా, ఆయన కొత్త నటులకు, నిర్మాతలకు సలహాలిస్తూ, వారిని సకల విధాలా ప్రోత్సహిస్తూ తమ శేషజీవితం గడిపారు.

---

"కాథలిక్ పోరాటయోధులసంఘంవారి ప్రశ్నలకు సమాధాన మివ్వడానికి కాదు నే నిక్కడి కొచ్చింది. ఇది పత్రికా గోష్ఠి" అంటూ చాప్లిన్ అడ్డు తగిలాడు.

"మీరు అమెరికా పౌర సత్త్వం ఎందుకు తీసుకోలేదు" అని ఒక మూల నుంచి మరెవరో ప్రశ్నించారు.

"నా జాతీయతను మార్చుకోవలసిన అగత్యం నాకేమీ కనిపించలేదు. నేను ప్రపంచ పౌరుణ్ణి అనుకొంటున్నాను" అని చాప్లిన్ జవాబిచ్చాడు.

"సమావేశంలో కొంత కలకలం ఏర్పడింది. నలుగురైదుగురు ఒకేసారి మాట్లాడసాగారు. ఒక్క గొంతు మాత్రం స్పష్టంగా వినిపించింది; "మీరు అమెరికాలో కదా డబ్బు సంపాదించుకొంటున్నది?"

చాప్లిన్ చిరునవ్వుతో ఇలా జవాబిచ్చాడు: "సరి, డబ్బు గురించే మీరు మాట్లాడుతుంటే, ఆ సంగతి తేల్చుకుందాం, నాది అంతర్జాతీయ వ్యాపారం. నా ఆదాయంలో డెబ్భై శాతం పై దేశాల నుంచి వస్తున్నది. అమెరికా నా దగ్గర పూర్తి పన్నులు వసూలు చేసుకొంటున్నది. అందుకని, నేను అమెరికాకు మంచి లాభసాటి అతిథినన్నమాట."

మొదట మాట్లాడిన కాథలిక్ పోరాట యోధుల సంఘ ప్రతినిధి మళ్ళీ అందుకొన్నాడు: "మీరు డబ్బెక్కణ్ణుంచి సంపాదించుతున్నారనే సంగతి అటుంచండి. ఫ్రాన్స్ తీరంలో దిగిన (రెండో ప్రపంచ యుద్ధకాలంలో) పోరాట యోధులం మీరు అమెరికా పౌరసత్వం తీసుకోనందుకు నిరసిస్తున్నాం."

"అయ్యా, ఫ్రాన్స్ తీరంలో దిగింది మీరొక్కరే కాదు. పాటన్ సైనిక

జననం: ఏప్రిల్ 16, 1889.



అస్తమయం: డిసెంబర్ 25 1977

దళంతో పోరాడిన వాళ్ళలో నా కొడుకు లిద్దరున్నారు. వాళ్ళు మీలా గొప్పలు చెప్పుకోవడం లేదు" అని చాప్లిక్ జవాబి చ్చాడు.

"మీరు హన్స్ ఈస్లర్ నెరుగుదురా?" అని ఒక విలేకరి ప్రశ్నించాడు

"తెలియక పోవట మేమిటి? అతడు గొప్ప గాయకుడు, నాకు ఆప్తమిత్రుడు కూడా" అని చాప్లిన సమాధాన మిచ్చాడు.

"అతగాడు- కమ్యూనిస్టనే సంగతి మీకు తెలుసా?"

"అయినా ఫరవాలేదు. రాజకీయాలు ఆ నా స్నేహానికి ఆధారం కావు."

"అయితే కమ్యూనిస్టు లంటే మీకు ఇష్టమన్నమాట" అన్నారు మరొకరు.

"నా యిష్టానిష్టాల్ని ఎవరూ నిర్ణయించ వీల్లేదు. మన మింకా ఆ స్థితికి రాలేదు."

ఈ రొద మధ్య ఎవరో అందుకొని, "ఒక్క జవానికి ఎంతో ఆనందం కల్పించి, వాళ్ళపట్ల ఎంతో సానుభూతి చూపిన మీలాంటి కళాకారునికి, అమెరికా పత్రికా ప్రపంచ ప్రతినిధులమని చెప్పుకొనేవారు మిమ్మల్ని ఇలా గేలిచేస్తుంటే ద్వేషిస్తుంటే మీకేమని పిస్తూవుంది?"

అప్పటికి చాప్లిన్‌కు ఓపిక నశించింది. సానుభూతి వచనాలు స్వీకరించే స్థితిలో కూడా లేక పోయారు. "క్షమించాలి, మీరు అడిగిందేమో నాకు బోధపడలేదు. మరో సారి అడగండి" అన్నారు.

చాప్లిన్ పత్రికా విషయాల సహాయకుడు, మెల్లగా "ఇతగాడు మీకు అనుకూలుడండీ. మిమ్మలి ప్రశంసిస్తున్నాడు" అని అందించాడు, ఆ మాటలన్నది జిమ్ అగీ అనే ఇతడని గుర్తుచేశాడు అగీ ప్రసిద్ధకవి, నవలా కారుడు. టైమ్ పత్రిక తరపున పనిచేస్తున్నాడు. చికాకు పడిపోయిన చాప్లిన్ మళ్ళీ, "క్షమించాలి మీరన్నదేమో వినిపించలేదు. మరోసారి అడగండి" అన్నారు.

అగీ, రెండోసారి తన ప్రశ్న వల్లించాడు.

# బెర్టోల్ట్ బ్రెహ్ట్, కె గారి కథలు

(జర్మన్ మాతృకకు అనువాదం: కాట్రగడ్డ గంగయ్య)

## దేవుడున్నాడా?

కె గారిని ప్రశ్నించారొకరు: దేవుడున్నాడా? కె గారి జవాబు: ఇదిగో చూడబ్బాయి! నేనో సలహా చెప్తాను ఆలోచించు — నీ ప్రశ్నకు వచ్చే సమాధానంపైని నీ ప్రవర్తన ఆధారపడి వుంటుందా లేదా అని. వచ్చే సమాధానం మీద నీ ప్రవర్తన ఆధారపడి వుండదనుకో-అప్పుడా ప్రశ్నజోలికే పోనక్కరలేదు. ఒకవేళ సమాధానాన్నిబట్టి నీ నడత ఉంటుందనుకో. అంటే నీ వప్పుడే నిర్ణయం చేసుకున్నావన్నమాట, నీకో దేవుడు కావాలని. అదే నీకు గుర్తు చేసేది.

## మరొకరి ఇంట్లో

ఎవరింటికైనా మొట్టమొదటిసారి వెళ్ళినప్పుడు, కె గారు తాను విశ్రమించే ముందు చేసే పనేమిటంటే, యింట్లోనుంచి బయటికి వెళ్ళడానికి తలుపులు ఎక్కడున్నాయా అని కనిపెట్టడం.

"ఏమండీ, మీరెందుకలా చేస్తున్నా"రన్న ప్రశ్నకు ఆయన సమాధాన మిది:

"అది నాకు చాలా కాలం నుంచి అలవాటండి. నేను న్యాయం కోసం పడి చస్తాను. అంచేత నేనున్న చోటునుంచి బయటి కెళ్లాలంటే ఒకటి కంటె ఎక్కువ దార్లు లేకుండా వుండడం మంచిది కదండీ!"

## మీ రెవరినన్నా ప్రేమిస్తే....

"మీ రెవరినన్నా ప్రేమిస్తే ఏం చేస్తారు?" అన్న ప్రశ్నకు కె గారి జవాబు:

"నేనో నమూనాను తయారుచేసుకొని, దానికీ ఆ వ్యక్తికీ పోలిక వుండేలా ప్రయత్నిస్తాను."

"అంటే ఆ మనిషిలాగా ఆ నమూనా వుండేలాగనా?"

"కాదు, కాదు! ఆ మనిషి ఆ నమూనా లాగా వుండేందుకు!"

---

చాప్లిన్‌కు ఏమీ పాలు పోలేదు." చెప్పాల్సిందేమీ లేదు.... అయినా మీకు ధన్యవాదాలు" అంటూ గోష్ఠి తుంచేశారు,

"మహాశయులారా, ఈ సమావేశంలో నా చిత్రాన్ని గురించి ప్రశ్నలు అడుగుతారనుకొన్నాను. కాని యిది రాజకీయ దొమ్మీగా పరిణమించి నందుకు విచారిస్తున్నాను. ఇక నేనుచెప్పవలసిందేమీలేదు."

□□□□



వీరాస్వామయ్య గారి కాశీయాత్ర చరిత్ర 19 వ శతాబ్దపు సాంఘిక పరిస్థితులకు దీటైన దర్పణమని చెప్పవచ్చు. ఆయన యాత్ర సాగించిన కాలంలో (1830-31) మన దేవాదాయ ధర్మాదాయా లన్నిటినీ ఈస్టిండియా కంపెనీయే నిర్వహించేది. భోగాలు, అర్చనలు వగైరా కలెక్టర్లు చేయించేవారు. మిగిలిన సొమ్ము కంపెనీ ఖజానాలో చేరేది. ఆ విధంగా, తిరుపతి దేవస్థానం మీద సాలుకు లక్ష రూపాయలు కంపెనీకి లభించేది. శ్రీశైలం దేవాలయం మీద కందనూరు నవాబుకు 18 వేల రూపాయలు లభించేవి. కాని అతను దేవాలయానికి మరమ్మతులు చేయించేవాడు కాదు. అహోబిళం, మహానంది, నివృత్తి సంగమం కూడా కందనూరు నవాబుకు చెందినవే. శ్రీశైలంతో సహా, ఈ దేవాలయా లన్నిటిలోను అర్చకులు తంబలవాండ్లు; బ్రాహ్మణులు కారు. పూజలు ఎవరికి వారే, కులాలతో నిమిత్తం లేకుండా చేసేవారు. బహుశా యివి వీరశైవం యొక్క ప్రభావంవల్ల కావచ్చు. శ్రీశైలంలో 360 దేవదాసీల యిండ్లుండేవి పూరీ దేవాలయం మీద కంపెనీకి 1 లక్ష 20 వేల రూపాయలు రాబడి వచ్చేది. ఇక్కడి పండాలకు 700 యిండ్లుండేవి.

○○○○○○○○ *గత సంచిక తరువాయి* ○○○○○○○○

# ఏనుగుల వీరాస్వామయ్య కాశీయాత్ర

○○○○○○○ *కంభంపాటి సత్యనారాయణ* ○○○○○○○

వీరు 36 తెగలకు చెందినవారు. పూజలు, వంటలు మొదలైనవి వీరే చేసేవారు. వీరికి భూ వసతి లేకపోయినా, కొందరు లక్షాధికారు లయారు. ప్రసాదాలు అంగళ్ళలో అమ్మేవారు. అన్ని కులాల వారు వాటిని రుచిచూచి కొనుక్కొనేవారు. జ్యేష్ఠ శుద్ధ పౌర్ణమి మొదలు అమావాస్య వరకు దేవాలయంలో ఆరాధన గిరిజనులచే చేయబడేది. పండాలకు కూడా ప్రవేశం లేదట! పూరీ దేవాలయం హిందూ, బౌద్ధ, జైన భక్తులకు పవిత్రమైనట్టిది. భువనేశ్వర దేవాలయంలో చాకళ్ళకు, హరిజనులకు తప్ప మిగతా వారందరికీ ప్రవేశం ఉండేది. ఓఢ్ర బ్రాహ్మణులలో 48 తెగల వారుండేవారట. ప్రసాద స్వీకారంలో ఉచ్చ, నీచ భేదాలు లేవట గంగాతీరంలో అన్నిజాతులు సామూహికంగా స్నానాలు, పూజలు చేయటం, కాశీలో కులభేదాలు లేక అందరూ పూజలు చేయడం రచయితను ఆకర్షించాయి.

గంజాం జిల్లా లగాయతు కోస్తా పొడుగునా బ్రాహ్మణ అగ్రహారాలు మిక్కుటంగా ఉన్నట్లు వీరాస్వామయ్య గమనించారు. కృష్ణ మొదలు గోదావరి వరకు పంచాంగ శ్రవణం ప్రబలంగా ఉండేదట. నిర్మల ప్రాంతంలో అనేక బ్రాహ్మణ కుటుంబాల మండలికి సభాపతి అనే ఒక బ్రాహ్మణుడు సర్వాధికారిగా వ్యవహరించే

వాడట. ఈ ప్రాంతపు యాత్రికులు కులభేదాలను కఠినంగా పాటించేవారు. బ్రాహ్మణులలో పంచ గౌడులు, పంచ ద్రావిడులు, గయా వళీలు, బెంగాలీ బ్రాహ్మణులు అదిగా గలవారి ఆచార వ్యవహారాలను వీరాస్వామయ్య వివరంగా వర్ణించారు. కాశీ స్థలానికి అధికారులుగా గంగ పుత్రులనే 1200 యిండ్ల వారు యాత్రికుల వద్ద నిర్బంధంగా సొమ్ము వసూలు చేసేవారు. ఇవ్వలేనివారిని కొట్టి హింసించడం, మానభంగం చేయడం చేసేవారట.

తంజావూరు మహారాజు, విజయనగర రాజు వంటివారే, ఈ గంగాపుత్రుల ఒత్తిడిని భరించలేక, మణికర్ణికలో స్నానం చేయకుండా వెళ్ళిపోవలసి వచ్చిందట. గోసాయిలలో కొందరు షాహుకార్లుగా ఉంటూ, మహాజనులనే పేరుపెట్టుకొని, ధనికులుగా తయారయారు. కాశీలో ఆనాడు మూడు ఉపద్రవా లుండేవట. వాటిలో ఒకటి వితంతు స్త్రీలు. వీరివల్ల ప్రజలకు బహు విపత్తు సంభవించేదట. బెంగాలీ బ్రాహ్మణులైన ఉత్కళ గౌడులలో ఒక దురాచారం ప్రబలంగా ఉండేది. వారిలో కులీనులైన వారికి కన్యల నిచ్చి వివాహం చేస్తే తమ కులం పవిత్ర మవుతుందనే నమ్మకంతో, చాలమంది హీనకులస్తులు విపరీతంగా ధనంయిచ్చి తమ కూతుళ్ళను బహు కొద్దిమందైన కులీనుల కిచ్చి పెండ్లి చేసేవారు. దీన్ని అవకాశం తీసుకొని, ఆ కులీనులు, రాత్రికి అరువందల రూపాయల చొప్పున యిస్తేగాని తమ భార్యలతో శయనించేదిలేదని పట్టుపట్టేవారట. ఇట్టి వివాహాలవల్ల, చాపల్యంలేని స్త్రీలు బాధ లనుభవిస్తూ, చాపల్యం కలవారు నీతిబాహ్యు లవుతూండేవారు.

శ్రీశైలం చేరే ముందు, పెద్ద చెర్వు అనే ఊరిలో నివసించే చెంచుల నాయకుడు, నవాబు ఆజ్ఞప్రకారం, మనిషికి 3 డబ్బుల చొప్పున హాశీలు వసూలుచేసి, యాత్రికులందరకీ బియ్యం, పాత్ర సామాగ్రి యిచ్చి వంట చేసుకోడానికి వీలు కల్పించేవాడు (శ్రీశైలం మల్లిఖార్జునుడు చెంచుపడుచును కోరి పెండ్లి చేసుకున్నట్లు వాడుక.)

వీరాస్వామయ్య గారి పరివారంలోని స్త్రీలంతా శూద్రులూ, ముస్లింలూ కాకే డేరాలలో భోజనాలు చేయడానికి తిరస్కరించడం; కడప మొదలు గోదావరి తీరం వరకు నివసించే వారిలో శూద్రుల చేతి హుక్కాలు యితరులు త్రాగుతూ ఉండడం; హైదరాబాద్ నగరంలో మహమ్మదీయుల మొహరం పండగకు "అనేక వేలమంది యితర మతస్థులు" వచ్చి సకల విధాలైన ఆరాధనలను అంగీకరించడం; ఆ ఉత్సవ కాలంలో "పరమాత్మని చైతన్యం అక్కడ ప్రతిఫలించడంచేత" వీరాస్వామయ్య గారు దానిని పుణ్యస్థలమని భావించడం; డేవిడ్సన్ అను ఆంగ్లేయునితో చర్చిస్తూ, వీరాస్వామయ్యగారు భారతదేశంలో వర్ణవ్యవస్థ మానవ కల్పితమేగాని, ఈశ్వర సృష్టికాదని వాదించడం; కృష్ణాజిల్లాలో నివసించే బ్రాహ్మణులు కొందరు ధనార్జనకై భార్యాబిడ్డలను వదలి, ఉత్తరాన కాశ్మీరనుంచి దక్షిణాన కన్యాకుమారి వరకు వలస వెళ్ళడంచేత వారి భార్యాబిడ్డలు వారి జాడ తెలియక విలపించడం; రాజ

మహేంద్రవరానికి దక్షిణాన కరణీకపు వృత్తిలోనున్న నియోగులు బాగా ప్రాబల్యం వహించి, బాటసారు లెవరైనా వెళ్ళి కాస్త స్థలం యిమ్మని అడిగితే, "బ్రాహ్మణ యిండ్లకు" పోయి అడగమనడం, మీరు బ్రాహ్మణులు కారా అని అడితే కాదని నిర్మొగమాటంగా జవాబు చెప్పడం; గంగాస్నానం సాకుతో అనేకమంది పడుపు కత్తెలు ఉదయమే ప్రత్యక్షమవడం — మిక్కిలి ఆసక్తిదాయకమైన విషయాలు.

కాశీయాత్ర చరిత్రలో మన చేతి పరిశ్రమల ప్రస్తావన అక్కడక్కడ కనిపిస్తుంది. కందనూరు నవాబుకు చెందిన చాల గ్రామాల్లో, దువ్వూరు మొదలుకొని ప్రతి గ్రామంలోను, కొండకరమలవాండ్లు ఇనుప రాళ్ళతో యినుం చేస్తూ ఉండేవారు. గంగనదీతీరంమీద మీర్జాపూర్ అనే పట్టణంలో పాత్ర సామాన్లు చేసే కంచరవాండ్లు, 1000 కుటుంబాల వారు, రాత్రింబగళ్ళు పనిచేస్తూ ఉండేవారు. అక్కడి పాత్ర సామగ్రి హిందుస్థాన్‌కంతా ప్రసిద్ధ మయినది: గుంటూరు జిల్లా వేటపాలెంలో 1000 మంది నేతగాండ్లు అనేక దేశాలకు ఉపయోగపడే తోపుసెల్లాలు, రుమాలా తానులు, చీరలు వగైరా నేస్తూ ఉండేవారు. ఈ జిల్లాలోనే చినగంజాం మొదలు సముద్రతీర మందు ఉప్పు విస్తారంగా తయారుచేయబడేది; ఉప్పర స్త్రీలు పురుషులతో కలిసి భూమిని త్రవ్వి పొలాలు ఏర్పరచే పనులలో నిమగ్న లయేవారు. గంగానది మీద ఘాజీపురంలో గులాబీ పువ్వులు అమితంగా పూసేవి. వాటిని బట్టీల మీద కాచి, పన్నీరు తయారు చేసేవారు. తులం పన్నీరుకు 2,00,000 గులాబీ పువ్వులు అవసరమట.

ఈ విధంగా, వీరాస్వామయ్య గారి కాశీయాత్ర చరిత్ర 19 వ శతాబ్దపు పూర్వార్ధ భాగంలో భారతదేశపు ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిస్థితులను కళ్ళకు కట్టినట్లు చిత్రిస్తుంది. చరిత్ర పరిశోధకుల కిది అమూల్యమైన గ్రంథం.

(సమాప్తం.)

---

... జీవశాస్త్రం, డ్రాయింగ్ వంటి వాటికి పాఠశాలల్లో ప్రాముఖ్యం యిస్తూవున్నప్పుడు బాలికల పాఠశాలల్లో మాత్రం—మొగపిల్లల పాఠశాలల్లో కాదు—సంగీతోపాధ్యాయుల అవసరమున్నదన్న అభిప్రాయం దురదృష్ట వశాత్తూ ఏర్పడి వుంది...

... ప్రకృతివల్ల వచ్చే ప్రతిభనుబట్టి వుంటుంది కాబట్టి, ప్రతి ఒక్కరూ పాడలేక పోవచ్చు. కాని సులభమైన పాటల్ని తెలుసుకునేలాగా ప్రతి ఒక్కరికీ బోధించవచ్చును. పాఠశాల లన్నింట్లోనూ పాఠ్యక్రమంలో భాగంగా సంగీతాన్ని చేర్చలేదు ఎందువల్ల?...

... సంగీతమంటే ప్రామాణిక సంగీత మొక్కటే కాదు. ఎంతో వైవిధ్యం మున్న జానపద, మత, తదితర విధాలైన సంగీతం వుంది. ప్రాచీన భారత జీవనంలో నూతినుండి నీరు తోడేటప్పుడు, పొలం దున్నేటప్పుడు సంగీతం వులదేది. కూలిమనిషి, జాలరి, కుమ్మరి, చివరకు ముష్టిమనిషి కూడా పాటలు పాడతాడు. ఈ పాటలు చక్కగా వుంటాయి కాని యివి యిప్పుడు వినిపించడంలేదు. కాని పాశ్చాత్యం, భారతీయం కాని పాటలు మనం పుష్కలంగా వింటున్నాము.

— రుక్మిణి అరండేల్

*[విమర్శలలో 'ఘాటు' లేదనీ, వుందనీ తర్జనభర్జనలు ఈ మధ్యా తరుచు వినిపిస్తున్నాయి. ఏపాటి 'ఘాటు' పాళంగా వుంటుందని ఒక పాఠకుడు ప్రశ్నిస్తున్నారు. సమాధానం ఇవ్వవలసిన ప్రశ్న. సం.]*

# సాహిత్య విమర్శ – కోపతాపాలు

అవంతి

తెలుగు సాహిత్యం ఇప్పుడొక సంధి దశలో వుంది. తెలుగు వాళ్ళు స్వయం వ్యక్తీకరణకు అపారోత్సాహం చూపుతున్నారు ఒక దశదాకా పెరిగి, తాత్కాలికంగా నిస్తబ్ధస్థితిలో పడిన తెలుగు సాహిత్య ప్రక్రియలు మరల పునశ్శీలనం పొందుతున్న దశ యిది.

ప్రతి యువకుడు, యువతి, ఉద్యోగి, గృహిణి తమ మనోభావాలకు సాహిత్య రూపం ఇస్తున్నారు. కాని వాటిలో అత్యధికభాగం కళాత్మకంగా లేవు. సహజం. ఎంతో శక్తివ్యర్థం అవుతూంది. అదీ నిజమే. తమ ఆలోచనా ధోరణి అత్యద్భుతమైనదని, మిగతా అంతా వట్టి వ్యర్థమనీ ఎవరికి వారే భావించుకోవడం, ముఠాలు కట్టడం, సాహిత్య ప్రక్రియలతో, డబ్బూ, అవకాశమూ వుంటే పత్రికలలో ఈ స్వోత్కర్షా, పరనిందలు కురిపించడమూ ఈ దశ లక్షణం. తెలుగు సాహిత్యరంగాన్ని ఈదశనుంచి బయటకు తేవాలంటే సద్విమర్శను బాగా అభివృద్ధి చెయ్యాలి. అంతేకాని తనకు కిట్టని దానిమీదల్లా తుమ్ముపొయ్యడం పరిష్కారం కాదు.

ఇతర సాహిత్య ప్రక్రియ లన్నిటి లాగే తెలుగులో విమర్శ కూడా చాల దీన హీనస్థితిలో వుంది. దానికి సరియైన ప్రమాణాలు ఏర్పరచుకోవలసి వుంది. తాను ప్రమాణాలను ఏర్పరచుకొంటూ, ఇతర సాహిత్య ప్రక్రియల ఉన్నతికి తోడ్పడవలసిన బాధ్యత ఈ సాహిత్య ప్రక్రియ కుంది.

ఇతరులకన్న తన మేధ కొంచెం పై స్థాయిలో వున్నదనీ, వారికి చెప్పవలసినది తనవద్ద ఏదో కొంత వున్నదనే అహం, గోరోజనం లేనివాడు అసలు కలం పట్టలేదు. ఎంత హేతుబద్ధంగా చెప్పామనుకున్నా, రచయిత చేత వొప్పించడం కాని కాదు.

విమర్శవిషయంలో మనదేఅంతిమనిర్ణ

యం కాదు. సంస్కారం, చదువు, ఆలోచన, అనుభవం ఇవన్నీ భిన్నంగా వుంటాయి, మనుష్యులలో. మన విమర్శ మరొకరికి సరిగా తోచదు. ఈ వాద ప్రతివాదాలు విమర్శ పెరుగుదలకు అవసరం. వీనివలన లాభపడేది పాఠకులూ, రచయితలూను.

అయితే సాహిత్యపు విలువలు ఒక్కటేనా ఈనాడు సంఘర్షిస్తున్నవి? కాదు. రాజకీయ పంథాల గురించి, సామాజిక సమస్యల గురించి, ఆర్థిక ప్రయోగాల గురించి, తాత్వికాలోచనల గురించి మనందరికీ పరస్పర వ్యతిరేక భావనలున్నాయి. ఎవరి విశ్వాసాలు వారికున్నాయి. అంతమాత్రంచేత రెండో ఆలోచనను, వాటిని ప్రతిపాదించే వానిని శత్రువుగా భావించి లాభంలేదు. ఆ ఆలోచనను నీ తాత్వికదృష్టితో విమర్శించు, ఖండించు. నీ కక్కడ శత్రువు మనిషి కాదు. ఓర్పుతో నీ వాదనలోని గొప్పతనాన్ని ప్రబలచేత ఒప్పించు. కూడగట్టుకో. ఈనాడు సాహితీ సైనికుల కర్తవ్యం అది. నిశిత ఖండన అవసరమే. కాని, లక్ష్య శుద్ధి లేకుండా కేవల దూషణలలో చేస్తే ప్రయోజనం వుండదు.

ఒక కథ తీసుకోండి. ఒక నవల తీసుకోండి. ఒకే సామాజిక సమస్యపై వచ్చిన రచనను తీసుకోండి. దాని మంచి చెడ్డలు—వస్తురీత్యానూ, శిల్పంరీత్యానూ—చర్చించండి, వ్రాయండి. ఆ విధంగా వ్రాసేటప్పుడు ఆ రచయితమీద గౌరవభావంగాని, న్యూనభావంగాని పెట్టుకోవలసిన పనిలేదు. ఏమంటే, మన రచయితలు స్థిరబిందువులుగా లేరు. వారు పెరుగుతూనూ వున్నారు, దిగజారుతూనూ వున్నారు. ఆ రచయిత గతకాలపు గొప్పదనమూ, కొంచెపుతనమూ కేసి పోకుండా ఓ ప్రత్యేక రచనకు పరిమితం కావొచ్చు. లేదా రచయిత వ్రాసిన మొత్తం సాహిత్యాన్నో, అధికభాగాన్నో చర్చకు తీసుకున్నప్పుడు సాకల్యంగా రచయిత ఎదుగుబొదుగులు, బలాబలాలు చర్చించవచ్చు.

ఆ దృష్టిలోంచి ఆలోచిస్తే, తప్పులు మాత్రమే వెతుక్కుంటూ కూచోవడం సాహిత్యరంగంలోనే కాదు, అసలు జీవితరంగం దేంట్లోనూ మంచిది కాదు. ప్రతిదాంట్లోనూ మంచీ, చెడూ రెండూ వున్నాయి.

ఈ వస్తున్న చెత్తలోనూ ఒక మంచి లేకపోలేదు. అది తెలుగువాళ్ళలో చదివే అలవాటు పెంచుతూంది. కాని చదివే అలవాటు పెంచుతూంది. క్రమంగా వారిలో విచక్షణాజ్ఞానం పెరుగుతూంది. ఇంకా పెరుగుతుంది. సాహిత్యం స్థాయి పెరిగినకొద్దీ నాసిరకపు రచనల స్థాయి పెరుగుతుంది. ఆగ్రహమొక్కటే సర్వౌషధం కాదు. నిగ్రహంవల్ల నిదానంవల్ల చాలా పనులు జరుగుతాయి. 

---

దుర్మార్గుడి సాహసాన్ని మెచ్చుకునేవాడు, ఆ దుర్మార్గుడి చేత చంపబడిన వాడిపట్ల జాలి చూపలేడు.

— దోస్తొయెవస్కీ

# రచయితలకు శిక్షణ అవసరం

సోమసుందర్

లూత తన లోపలి ఏ మూల నుంచో సున్నితమైన దారం తీస్తూంటుంది. దానితో తన జీవనాధారమైన పట్లు అల్లుకుంటూ పోతుంది. కవీ, రచయితా సైతం లూత వంటివారే: తమలోపలి నుంచి ఊహల సిల్కుదారం తీస్తారు. దానితో కవితలో కథలో అల్లుకుంటూ పోతారు. దారం ఎంత ఆర్కేగా ఉన్నా-నేయవలసినదాని దరుజును బట్టి అల్లిక నేర్పు రూపొందుతుంది. ఊహలూ భావాలూ భాషలో మెదిపి ఓతప్రోతంగా అల్లబడిన కవితలలో మన్నిక (Texture) ఏర్పడుతుంది. అలా అల్లబడినది పది కాలాలపాటు నాణ్యంగా సాగడానికి అవకాశ మేర్పడుతుంది.

ఐతే కవి చేసే ఈ అల్లిక పని, తన లోపలి నుంచి తత్పూర్వం ఏ వస్తుతత్వమూ లేని దారం తీయడం వరకే లూతతో పోలిక: కారణమేమంటే లూతఅలా చేయకపోతే దానికి బ్రతుకేలేదు. కవి ప్రాథమికంగా మనిషి. మనిషిగా జీవనాధార మార్గాలు లక్షలున్నాయి కనక ఈ కవిత్వపు అల్లిక మరీ అంత ప్రాథమికావసరం కాదు.

కళాకారుడికి ప్రతినిధిగా గాయకుడ్ని, చేతి పనుల పరిశ్రమకు ప్రతినిధిగా ఒక వడ్రంగిని తీసుకుందాం. గాయకుడుగా ఒకడు రూపొందడానికి-ప్రాథమికంగా గురు శుశ్రూష అవసరం. ఆవిద్యలో మెలకువలు నేర్చుకొని, కంఠగతంచేసుకోవడం అవసరం అలా నేర్చినదానిని అభ్యాసంద్వారా, సాధనద్వారా స్వాధీనంచేసుకోవడం ద్వితీయావసరం. అలా అని అది అంత ప్రాముఖ్యత లేదని కాదు. అలాంటి అభ్యస్త విద్యపై సంపూర్ణాధికారాన్ని సముపార్జించి-ప్రదర్శనా శ్రేణి కెదగడం ఆ కళా జీవితాన్ని తురీయావస్థ. ఒక కళ ప్రదర్శన దశకు వచ్చేసరికి అపూర్వవ్యక్తిత్వం అలవర్చుకోవాలి. అపూర్వ వ్యక్తిత్వం స్వీయ ప్రతిభపై ఆధారపడి ఆయత్తమవుతుంది. అప్పుడు గాయకుడనే మాటకు సంపూర్ణార్థం ఆవిష్కృతమవుతుంది.

ఒక వడ్రంగి ప్రారంభకుడుగా (విద్యార్థిగా) గురువు దగ్గర ముందు చిత్రిక గుల్ల లాగుతాడు. గురువు గీతలు గీయిస్తే ఉలితో ఉసులు కొడతాడు. బాడితతో అవసరమైనంత పరస్థంమే చెక్కేస్తూ సాపు చేయడం నింపాదిగా నేర్చుకుంటాడు. ఇవన్నీ ప్రాథమికంగా ఒకటి రెండేళ్ళలో అలవడ్డాకనే మరో రెండేళ్ళపాటు మేస్త్రీ (గురువు) కెదురుగా కూర్చుని అతని పనితనం చూస్తూ, అతని పురమాయింపు ప్రకారం పనులు చేసుకుంటూ పోతాడు. అలా ఏ అయిదేళ్ళకో ఒకడు స్వయంప్రతిపత్తిగల వడ్రంగిగా రూపొందుతాడు. వడ్రంగి అంటే వడ్రంగే అని కాదు.

ఏ Skilled Labour కేనా యింత Apprenticeship ఉండి తీరాల్సిందే; కేవలం హస్తవాసి మీద ఆధారపడ్డ పరిశ్రమలకే ఇంత ప్రాథమిక విద్య అవసరమవుతున్నదే; అలాంటిదొకడి హృదయస్థమైన కళాశీలత నావిష్కరించుకుందుకు ఏ ట్రెయినింగూ అవసరం లేదా?

కనుకనే సంగీత సాహిత్యాది కళల పట్ల ఎంత జాగరూకమైన అభ్యాసమూ సాధన సంపత్తీ అవసరమో తెల్పడానికే పై వివరమంతా ఇచ్చాను. గాయకుడు తన గొంతు తాను సర్దుకోవాలి. అపక్వమైన జీరల్ని పోకార్చుకోవాలి. గాత్రధర్మంలో పరిశుద్ధతనీ, శ్రుతి పక్వతనీ స్వాధీనం చేసుకోవాలి అలా చేయకపోతే ఒకడిది గాలి పాటే అవుతుంది. ఇక కవీ రచయితా ప్రాథమికంగా ఎంత సాధన చెయ్యాలి? మనసులో తోచీ తోచగానే మథనపడకుండా ఉత్త ముడి పదార్థాల్ని ప్రదర్శించి పారేస్తున్నారే; వాళ్ళ నేమనాలి మరి?

ఇలాంటి కష్టభరితమైన సాధన జోలికి పోకుండా-రెండు ముక్కలు చెక్కేసి, నేరుగా కీర్తి సంపాదించాలని అంగలార్చే వాళ్ళనే నేను అర్భకులని తరచుగా అంటూంటాను. అర్భకుడంటే నా ఉద్దేశ్యంలో Untrained Weekling. అని మాత్రమే తప్ప-అదేమీ నింద కాదు, బూతు కాదు.

మనది ప్రధానంగా పబ్లిసిటీ యుగం. ప్రతివాడూ ఏదో ఒక పని చేసి పబ్లిసిటీ పొందాలని కోరుతాడు. పబ్లిసిటీ పొందడానికి వీలయిన మార్గా లన్నిటిలోకీ రచయితగా పేరచ్చు కావడం నలుగురికీ సులువుగా అనిపిస్తోంది. అందు నా కవిత్వంలా కనిపించేటట్లు వేషధారణ చేయబడ్డ ముడి వాక్యాలను రాసి పంపితే-ప్రోత్సహించడానికనో, పొయటిక్ సెన్సిబిలిటీ లేకనో అచ్చు కెత్తే మాంధాత లుండనే ఉన్నారు; అప్పుడా పబ్లిసిటీ మరింత తొందరగా వస్తుంది. సాహిత్యానికి అంకితమైన దనుకొనే 'అభ్యుదయ' వంటి పత్రికలు సైతం-వాక్యాన్ని నరికి పాదాలుగా పేర్చిన-"నిజాన్ని నిలువునా నరికేస్తున్నావు సత్యానికి సంకెళ్ళు వేస్తున్నావు అందరం ఒకటే భేదమెందుకు?" వంటి ముడిసరుకును కవిత్వంగా భాసింప చేస్తున్నాయి సింత పండూ చ్చెన గలూ అని ఉచ్చరిస్తూ-ఉచ్చరించినట్లు రాయడమే ప్రాథమిక హక్కుగా భావించే వాళ్ళను అర్భకు లనడం ఎలా దోషమో వారే చెప్పాలి; 

---

ఆడవాళ్ళయెడ మన అభిప్రాయంపట్టి మన సంస్కారాన్ని, దానిస్థాయినీ నిర్ణయించొచ్చు;

  

రచయితకు వాస్తవ ఘటనల మీదుండే భక్తి ప్రపత్తులు వాస్తవికత గొంతు నులిమేస్తాయి.

— గోర్కీ

మాదిరాజు రంగారావు అభ్యుదయాత్మక భావుకుడు. ప్రతీక ప్రధాన శిల్పి. నిరంతర రచనా వ్యాసంగి. ఆయన కవితాసంపుటు లింతవరకు పది పన్నెండు వెలువడ్డాయి. శ్రీశ్రీ అడుగుజాడలలో పదంమోపి పరిక్రమించిన 'కిమ్మీరం' మొదలు 'రసధుని', 'ముక్తకాలు' మీదుగా ఆయన కవితాఝరి బాంగ్లా మూలద్రవ్యాలు. వీటికి లోతైన భావుకత తోడయి "ఇది కాసారమో? మృగతృష్ణో? తెలీదు, ఇది సర్పమో? రజ్జువో అంతకన్నా, ఇది రూపమో? ప్రతిరూపమో తెలీదు, ఇది అదా? అది ఇదా? రెండూ ఒకటేనా?" వంటిచోట్ల తాత్వికార్థం మరింత గంభీరమై పోతుంది. దృశ్యమానమైన ప్రాకృతికాంశానికి,

# ముక్తకాలు - ఉష ఆగమనం

ఒక పరిశీలన

ఏల్చూరి మురళీధరరావు

స్వాతంత్ర్య పోరాటాలను స్పృశిస్తూ సాగింది.

ముక్తకాలలో భావావిష్కరణ సామర్థ్యవంతంగా చేయటం ప్రతిభావంతులైన కవులకు కూడా దుష్కరంగా ఉంటుంది. పూర్వోత్తరాన్వయ నిరపేక్షం కావడంచేత ముక్తకాలలో రసోత్పత్తికి స్థానం ఉండదు. వీటికి ఒక క్రమపరిణతి, అవిచ్ఛిన్నత, వస్త్వైక్యం ఉండకపోయినా మౌలికమైన లక్ష్యాంశంలో మాత్రం సాధారణంగా మార్పు ఉండదు. అందునా కవి ప్రగతివాది అయినప్పుడు అసలు ఉండదు.

మాదిరాజు రంగారావుగారి ముక్తకాలన్నిటిలో అంతర్ముఖత సర్వాంగీణంగా గోచరిస్తుంది. మానవ మనోవిశ్లేషణ, తాత్త్విక చింతన ఈయన కవితకు తాత్త్విక విశ్లేషణకు ఏకసూత్రత ఘటించి ముక్తకరూపం ఇవ్వడం ఈయన కవితా గుణం. "వెలుగు ముద్దు పెట్టుకుంటుంది, ఆకునీ పూవునీ పండునీ, చీకటి బుద్ధి చెబుతూనే ఉంది, ఊహకూ ఆశకూ మనస్సుకూ". ప్రతీక ప్రధానమైన అర్థచిత్రాల సంఘటన ఈ ముక్తకాలన్నిటిలోనూ మూర్తిమంతమై ఉన్నా కళాత్మకమైన అభివ్యక్తి మూలాన ఇవి వర్ణచక్రంలోని వెలుగులా వైవిధ్యం కలిగి ఉన్నవనడంలో సందేహం లేదు. స్వీకరించిన ఉపమానోపమేయాల సమాన ధర్మాన్ని అతి నిపుణంగా నిరూపించడం ఈ కవితలలో కానవస్తుంది. "బతుకు ఇంకా బతకాలంటుంది, నదిపై తేలివచ్చే అలలవలె ప్రియంగా, దూరంనుండి మృత్యువు గాలి వలె, వచ్చే

కొద్దీ ఉద్వేగ మధిక మౌతుంది" ప్రతీక లను ఇంత క్లిష్టంగా చిత్రింపకపోయినా అల్లికలోని బిగువు మాత్రం సడలదు : "ప్రతి క్షణం నశిస్తున్న జగత్తులో, అనుక్షణం జరుగుతుంది సృజన, ఉదయం కరగిపోయే మంచువలె, మనస్సులో చరిస్తూంటవి ఊహలు." వైవిధ్యవంమైన ఈ అభివ్యక్తిలో విదగ్ధమైన శిల్పం కొన్నిచోట్ల సాక్షాత్కరిసుంది. జీవిత నాటక మెంతవరకు? మృతువు తెర పడవంతవరకు, బ్రతుకు భేషజ మెంతవకుఆశకు అఘాతంరానంత వరకు'' "సామాన్యుని గుండెలో గూడు కట్టి బిగిసిన హిమ శ్రేణులవలె బాధలు, సామాన్యుని బ్రతుకులో ఎదురై, మారిన మరు భూముల వలె ఆశలు" — ఈ కవితలలోని వివిధ దృక్కోణాలను ప్రస్ఫుటం చేయడానికి ఇవి చాలు. సకృత్తుగా వీటి నడుమ "ఒకడు దూది కన్న తేలిక చూపుకు, మతిలో పాము కన్న ఎకువ విసపు కోరలు. ఒకని చూపు సన్నజాతి పూలదండ, అతని చేతం రాక్షస గణక్రీడా స్థానం'' వంటివి కూర్పుపై ఆధారపడి నడిచిన సామాన్య కవితలూ చోటు చేసుకున్నాయి.

జీవితంలోని వివిధ ఘటనలలో వ్యక్తి ప్రవర్తనల బహిరంతః స్వరూపాలను, మనోభావాలను విశ్లేషించి అద్వైత తాత్త్విక నిదర్శనలతో ఏకార్థం చూపించడం ఈ కవితలలో కనుపిస్తుంది. వీటిలో నిరాశకు తావు లేదు. తాను ఆశించిన చైతన్యాన్ని, ఉద్దీప్తినీ నిగూఢంగా ప్రబోధంచాలనే ప్రయత్నం సర్వత్ర ఉన్నది: ''స్వప్నం వచ్చింది, బ్రతికి ఉన్నట్లు తెలిసింది, తెలివివచ్చింది, చచ్చి ఉన్నట్లు రుజువైంది.'' కాల స్వరూపాన్ని గుర్తించినా, భవిష్యాన్ని సువర్ణ ఖండంగా ఆశ్వాశించి వర్తమా



# పాలస్తీనా కవితలు

అమ్మా,
నా స్నేహితులు వచ్చి
తలుపు తట్టి
నా సంగతి పదే పదే నిన్ను
అడుగుతున్నారని,
వాళ్ళు
అడిగినప్పుడల్లా నువ్వు
కన్నీరు మున్నీరవుతుంటావని
ఎంతో బాధపడుతున్నాను.

నిజానికి, అమ్మా నాకు
ఈ జైల్లోనే
అలలై లేచి కలలు
వెల్లుబికవస్తున్నట్టుంది జీవితం.
ఇంక నన్ను పలకరించటానికి
చిట్టచివరన వచ్చేది
గుడ్డి గుడ్లగూబ కాదు
తప్పకుండా పట్టపగలనినమ్ము.

["కవి సమయ్ అల్ ఖాసిమ్"జెయిలు నుంచి జాబు" నుండి]

నాన్ని ఆగామి యుగాను రూపంగా తీర్చి దిద్దాలన్న ఆశంస వీటిలో తొంగిచూస్తేనే ఉంటుంది.

ఈయన శైలిలో సన్న పోగారుతనం ఉండదు అలాగని శిథిల బంధమూ కాదు. మెరుగులు దిద్దని మేలిమిలా కాంతి తప్పిన రచన. పైగా వ్యుత్పత్తి మూలక మైన ఊహ కావడంచేత ఈయన కవితల లోని అభివ్యక్తిలో సారళ్యం లోపించి మనస్సును మెలిపెట్టే మాధుర్యం మృగ్య మైంది.

'ఉష అగమనం' అన్న ద్వితీయా ర్థంలో అభివ్యక్తి మరింత సంక్లిష్ట మయింది. "వెలుగుతో ఎదురౌతున్న, నీకు స్వాగతం పలుకుతున్న రోదసినై ద్యావాపృథివీ దేవతలు, ఆశీస్సులు ప్రస రిస్తున్నారు." "చైతన్యం విరిసిన ఆత్మ రోదసిలో, భామతి ఉషస్సు అవత రిస్తూ. ది, సహమతి అగ్ని మూర్తి సూర్యునివలె ప్రసరించి పరివృతుడనై ఉన్నాను" వంటి భాగాలు చదువుతుంటే ఇవి వచన గేయాలేనా అనిపిస్తుంది. Poetic touch లోపించి ఇవి మరీ తాత్పర్యాలలా ఉన్నాయి. ఇంతకంటె వీటిని, ఛందోబద్ధం చేయకమే ఉచితం. "స్వేచ్ఛా సమాజ రిరక్షావ్యగ్రమై, నా దేశమే చైతన్య సంభృతమై, మేల్కొని జ్వాలవలె శతకోటిముఖియై, తేజో ఒ సహ్య మయ్యెను శత్రుకోటికి" వంటిని వచన గేయాలంటే ఆశ్చర్యంగా నే ఉంటుంది మరి। ప్రసిద్ధ పద ఘటితాలు కాకపోవడంచేత వీటికి వచన గేయాలలో అసలు తావులేదు. "ఎవరొహో నిదు రించినదట। నీలాంబుర మాలా స్నిగ్ధ తనూ పల్యంకిక, ముహుర్ముహురాగత వీచీచయ, సంచాలిత పుష్పంచయ పక్ష లకత్యక్తాశా కొంతిచేల, దుఃఖ ప్రావర వృత" అన్నారు ఒక గేయంలో।

□□□□□□□□□□□□□□□□□□□□□□□□□□□□□□□□□□□

# పాలస్తీనా కవితలు

నేల రాచిన నీ ఆశలనుంచి
నీ పరుగులో దొంగిలించుకొన్న
మైళ్ళ నుంచి
మన పాపల కనుపాపల నుంచి
శిథిలాల గుట్టలనుంచి
హింసల ముళ్ళకంపల నుంచి
గోడల మీది
నెత్తుటి డాగుల నుంచి
పగిలిన నీ గుండెల్లో నుంచి
దూసుకొని వస్తుంది మళ్ళీ
ప్రభలా లేస్తుంది జీవితం
ఓ నా మహత్తర భూమీ,
లోతయిన గాయమా, ప్రేమా!

[కవయిత్రి ఫద్వా తౌఖిన్ పాలెస్తీనానే ఒక ప్రియునిగా సంభావించుకొని వ్రాసుకొన్న గీతిక]

"ఉష ఆగమనం అంతటా కళాత్మకమైన కమనీయ భావన మొగ్గ తొడిగి మూడు పువ్వులు ఆరు కాయలై "అని శ్రీత ప్రపంచ పరిధి, మానవతా మృదు జన్మ ఎత్తి, ఏదో ప్రవృత్తి మిడుకు చున్న, నా కెన్ని జన్మలకో కలిసి, బ్రతుకు లోతులు స్పృశించి, వెలుగులు త్రవ్వి తలకెత్తే నీవు, ఒక వసంత వాయువు వలె, సాగిరావో, శిశిరమూర్తిని నేను" అన్నప్పుడు విశ్వరూపం ధరించినా, పాత వాసన కొడుతున్న పద బంధాల నడుమన నలిగి నీరసపడింది. భావ చిత్రణలోని సంకీర్ణతకు గాఢమైన శైలిబంధం తోడై ఈ భాగమంతా దురవగాహంగా తయారైంది. ఐనా 'మబ్బులు ఎగిరే ఊహాలు, భయపడవు చీకటికీ, వెలుగుకూ నిలబడవు. ఎదురైనా కొండలు, ఎదలో అమృతం వర్షించేవి" వంటి ప్రసన్న గంభీర భావనలు ఆలంబనగా ఈయన కవితలలోని కళాత్మక ప్రతిభ ప్రౌఢిమకు అద్వితీయంగానే ఉన్నది.

స్థూలంగా ఈయన కవితా లక్షణాలు మూడు: వ్యుత్పత్తి మూలకమైన భావుకత, ప్రతీకాత్మకమైన అభివ్యక్తి, విచార్యమాణ రమణీయత్వం.

(ముక్తకాలు - ఉష ఆగమనం, వచన కవితలు-రచయిత శ్రీమారిరాజు రంగారావు, ప్రతులకు ఆంధ్ర సారస్వత పరిషత్తు, బొగ్గులకుంట - హైదరాబాదు. వెల - రెండు రూపాయలు.)

---

## జీవచైతన్యం ఒక సరితా ప్రవాహం

శశికాంత్ శాతకర్ణి

కిటికీ ఇవతల పొయ్యిలో
ఎండిన మామిడి కట్టెలు మండుతున్నై
కిటికీ అవతల పచగా పెరుగుతున్న
మామిడి మొక్క నునులేత
రెమ్మల పైటను సింగారించుకుంటూ
కథక్ నృత్యభంగిమలకు
మిమికింగ్ చేస్తోంది
గదిలోని పొయ్యిలో
ఎండిన కట్టెలు, చచ్చిన చీమలు మండి
పొగగా సహగమనించి కిటికీ
అవతలనున్న
మామిడి మొక్కపైకి పాకుతున్నాయి!
పొయ్యిపై గిన్నె క్రింద
మండిన మామిడికట్టెలు, చచ్చినచీమలు
పొయ్యిపై గిన్నెమీంచి కిటికీ అవతల
నునులేత రెమ్మల మామిడిశిశువు!
మూతను తప్పించుకొని
గది అంతటను ప్రసరిస్తున్న
గిన్నెలో మరుగుతున్న
పాయసపు సువాసనలు
కట్టెగా మారవలసిన నాలో
కొన్నివేల జ్ఞాపకాల సువాసనలు
రేపుతున్నాయి
నా జూకు రెమ్మలమామిడి మొక్కలో
చెట్టుగా పెరిగి కట్టెగామారే అనుభూతులు
ఆలోచనల భయంమామిడి ఆకులను
పువ్వులను ఆశ్రయించుకొని
బతికే చీమలు పొగగా మారి
ఇంటి చూరును కమ్ముకుంటాయి
గిన్నెలోని పాయసం సువాసనలను
వెదజల్లడం మానేస్తుంది. కాని
నునులేత మామిడి చిగురులను
చేతబుచ్చుకొని నాగుమ్మంలో శిశువు
కేరింతాలు కొడుతోంది
అమర జీవచైతన్యనం
అనంత సరితా ప్రవాహం!

కుమారి తుమ్మలపల్లి కవిత "గ్లాసు పగిలింది'' 'ఆంధ్రజ్యోతి' ప్రథమ బహుమతి)లో కథనూ, పాత్రలనూ వివరించేరు. అమ్మాజీ దంపతులు తలపెట్టిన ఒక విందుకు సిద్ధంచేస్తున్న ఖరీదైన గ్లాసుల పెట్టిలో ఒకటి పని కుర్రవాని చేతిలో పగిలింది. వాని చేయి

దీపావళి సందర్భంగా 'ఆంధ్రపత్రిక', 'ఆంధ్రజ్యోతి', వారపత్రికలు పోటీ జరిపి బహుమతులిచ్చిన ఎనిమిది కథలపై (5,3) ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ జరిపిన గోష్ఠి ప్రసంగాలసంగ్రహం, గోష్ఠిపొట్టి శ్రీరాములు స్మారక మందిరంలో జనవరి 1 న జరిగింది.

చర్చావేదిక

# బహుమతి పొందిన కథల పరిశీలన

తెగింది. అమ్మాజీ పనికుర్రవాని చేతి గాయం, వాని ఆకలికన్న పగిలిన గ్లాసు గురించిన బాధతో సతమతమైపోవడం దీనిలో కథ. కథావస్తువు చక్కనిది. నవ సంపన్న తరగతుల మీద రచయిత్రి విసుర్లుచురుగ్గావున్నాయి. రోజు రోజుకీ పెరుగున్న క్లాస్ గృహిణుల అడంబరాల్ని చక్కగా చూపేరు. వ్యాఖ్యానాలు, స్వగతాలు కథలో ఎక్కువ. సంభాషణలు తక్కువ. సుదీర్ఘోపన్యాసాలు చదవడానికి కలిగే విసుగే, ఈ సుదీర్ఘ స్వగతాలూ కలిగిస్తున్నాయి. దీని వలన కథాగమనం కుంటుపడింది అని తెలిపారు.

"కలం కార్చేది కన్నీరు కాకూడదు. జనం కోరేది జాలిగుండెలు కాదు." అన్న ప్రేమశీల మాటలకు రూపాన్ని దిద్దింది ఈ కథ.

తరువాత శ్రీ పసుపులేటి రామారావు బహుమతి కథల్లో ఏ ఒక్కటీ పాఠకుల్ని కదిలించి, హృదయాన్ని స్పందింప చేయగలిగేలా లేవన్నారు. శ్రీమతి పి. సత్యవంతిగారి "గ్లాసు పగిలింది''లో కథా వస్తువులోగాని, శైలిలోగాని కొత్తదనం లేదు. పెద్దవాళ్ళ ఆరాటాలు, క్రిందివాడి ఆక్రోశం కొంత మేరకు కనిపిస్తూ కథకు వాస్తవికరూపం యిస్తున్నాయి. ముగింపు కూడా సహజంగా లేదు.

రెండోకథ "జాడీ'' తెలంగాణాలో ఒక భూస్వామి తన పాలేరు గవరయ్యకిచ్చి ఊరగాయ జాడీని పట్నంలోవున్న కొడుక్కు పంపుతాడు. అతడు బస్సు వద్ద, పట్నందారిలో నానా అగచాట్లూపడి జాడీని భద్రంగా వప్పచెప్తాడు. అ శ్రమకి మెప్పు కాదుగదా, ఆ పూటకి అన్నం కూడా దొరకదు. ఇదీ కథ దీనిలో వాస్తవికత వుంది.

భూమి ఆక్రమణోద్యమానికి నాయకుడైన హరిజన యువకుణ్ణి గ్రామ భూస్వామి చంపించి, అతని భార్యను ఉంపుడుకత్తెను చేసుకొంటాడు. ఆమె సమయంకోసం కనిపెట్టి వుండి భూస్వామిని హతమారుస్తుంది. "ఈ కథలో సహజత్వంవుంది. సింబాలిజంతో కూడిన చక్కని నడకవుంది."

తరవాత 'ఆంధ్ర పత్రిక' వార పత్రిక బహుమతి కథలలో ఏ ఒక్కటీ తృప్తి కలిగించడంలేదన్నారు. "పైవాని స్వార్థాలు, క్రిందివాడి బాధలు, సమాజంలోని దోపిడీలు ఈ కథలలో కనిపించవు. ఇది వారి పంథా కావచ్చు కాని వారి పంథాలోనైనా మంచి సెంటిమెంటుగల వానిని ఏరుకున్నా బాగుండును."

శ్రీ మహీధర రామమోహనరావు తన ప్రసంగ' వ్యాసం చదువుతూ 'గ్లాసు పగిలింది'లో రచయిత్రి పని కుర్రవానిని తమ కథకు కీలకమైన పాత్రగా చేసుకొన్నారనీ, కానీ, యజమానురాలు అమ్మాజీ పాత్రను సృష్టించినంత సజీవంగా వాని పాత్రను నడపలేకపోయారన్నారు. "తరవాత కథలో సజీవంగా వున్న పాత్ర పనివాని తల్లిది. కాని, అసలు పనికుర్రవాడి పాత్ర నిర్జీవంగానే వుండిపోయింది. ఇది రచయిత్రియొక్క వర్గస్థితి పరిమితుల్ని తెలుపుతూంది."

సర్కారు జిల్లాలలో అయినా, తెలంగాణాలోనైనా కలవాని జులుం, అమానుషత్వం, ధనహీనుని భీరుత్వం, సంకోచం, అన్యాయాన్ని నోటితోనైనా చెప్పలేని నిస్సహాయతలతో పాఠభేదమే గాని, వస్తుభేదం లేదని చూపుతుంది 'ఆంధ్రజ్యోతి' ద్వితీయ బహుమతి కథ "జాడీ". ఈ కథ చక్కగా నడిచింది. అంటే ఆలోచింప చేస్తుంది. కాని కథలో చదువరిని కదిలించేఘట్టం గాంవాలా గవరయ్యని ఆటపట్టించి హింసపెట్టిన యువకుల అకతాయితనం, ఆవారాలుగా తయారవుతున్న మన యువకుల మన స్థితి చిత్రణ. మిగిలిన కథలో కొత్తదనం లేదు. మొదటి కథలో రచయిత్రి అమ్మాజీ పాత్రకు తేగల జీవశక్తి ఈ కథలో రచయిత ఈ ఘట్టానికి తేగలిగేరు."

"ఇంక మూడో బహుమతి కథ" "లేడి చంపిన పులి నెత్తురు" బలహీన వర్గానికి చెందిన వ్యక్తి బలవంతుడి మీద కసితీర్చుకోవడం దీనిలోని కథ అని పేరే చెప్తుంది. కాని లక్ష్యశుద్ధికీ, సమాజంలోని నిత్యవినీతులకు సంఘర్షణ దీనిలోని కథా వస్తువు. అయితే దానిని కేవలం మధ్య తరగతుల ఆచారాలూ, అలవాట్లూ, మనస్తత్వాల దృష్టినుంచే పరిశీలిస్తారు. తాను చిత్రిస్తున్న ప్రజల అలవాట్లు, ఆలోచనలు భిన్నంగా వుండవచ్చునన్న ఆలోచన రచయితకు లేనేలేదు.

ఈ విధంగా మూడు కథలలోనూ రచయితలు మన సమాజంలోని పీడిత, తాడిత ప్రజల పరిస్థితిపట్ల సానుభూతి ప్రకటించగలిగేరు. అందుకు అభినందించవలసిందే. అయితే ముగ్గురూ తమ మధ్యతరగతి మనస్తత్వానికి మాత్రమే కథలో పట్టం కట్టేరు. కనక కథలలో సహజత్వం, కనీసం కొత్తదనం లేకుండా

పోయింది.

"ఆంధ్ర పత్రిక" వారపత్రిక బహుమతులిచ్చిన అయిదు కథలను విడివిడిగా సమీక్షిస్తూ వీనిలో ఆఫీసుల్లో ఉద్యోగుల నిర్లక్ష్యం ఫలితంగా ప్రజల బాధలు చిత్రిస్తున్న "వన్ మినిట్" మాత్రమే సామాజిక పరిస్థితులను ఆలోచనలోకి తెచ్చేది. మిగతా వన్నీ కాలక్షేపం బఠాణీలే నన్నారు.

'పేరులేని కథ' రెండు మూడు మార్లు చదివినా కథకుడు చెప్తున్న దేమిటో అర్థమే కాలేదన్నారు. "కామాక్షి కోరిక" వెండి-గిన్నె ఒక మధ్య తరగతి గృహిణి తీరని కోరిక అది. తన బంధువు యింట అటువంటిది చూసి దాని దవడలు నొక్కేసి విరూపం చేస్తుంది. ఆ బంధువు కామాక్షికి బహుమతిగా ఆ గిన్నె ఇచ్చే ప్రయత్నం చూసి కామాక్షి తెల్లబోతుంది. దీనిలో ఓ హెన్రీ కథల్లో కనిపించే మలుపు కనిపిస్తుంది. "ఆనందానికి ముందు వెనకలు"లో ఒక పడుచు లెక్చరరు తన వద్ద పాఠం చెప్పించుకొనేందుకు వచ్చిన శిష్యురాలినే పొందుతున్నాననుకొని, చీకట్లో భార్యనే అనుభవించడం కథ. దీనిని చదువుతూంటే డెకమరాన్, డ్రోల్ స్టోరీస్‌లలోని కొన్ని కథలు జ్ఞాపకం వస్తాయి. "కలకాలం నిలిచేది" వట్టి సెంటిమెంటు నడ్డం పెట్టుకొన్న కథ. రాధాకృష్ణల ప్రేమను పెద్దలు భగ్నం చేసినా అది వారి హృదయాలనుంచి మాయదంటాడు కథలో.

"ఈ కథల తరహాలు చూస్తే ఆయా పత్రికా సంపాదకుల అభిమాన దురభిమానాలు అర్థం అవుతున్నాయి తప్ప, తెలుగు రచయితల సామర్థ్యం కనబడ్డం లేదు."

శ్రీ జి. సి. జీవి ప్రసంగిస్తూ బహుమతి కథ ఒక సంవత్సరం క్రితం శీలంసెట్టి రమాదేవి వ్రాసిన "పల్లకి" కథకు మక్కీకి మక్కీ కాపీ తప్ప వేరు కాదన్నారు.

శ్రీ శ్రీకాంత్ తమ ప్రసంగంలో ఒక కథ 'భూమికోసం' సినీమాలోని రెండుఘట్టాల్ని కాపీకొట్టి కూర్చిందే తప్ప వేరుకాదన్నారు.

---

## లేఖలు

### బహ్రైన్ నుండి విరాళం

నా స్నేహితులనుండి, సహోద్యోగుల నుండి రూ. 720 (బహరైన్ దీనార్లు 35/500) వసూలు చేశాను. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నిధి పేరిట విజయా బ్యాంక్ లిమిటెడ్, హైదరాబాద్ డ్రాఫ్టు పంపుతున్నాను.

సాంఘిక సేవకు సంబంధించిన మీరు చెప్పే ఏపనినైనా చేసేందుకు శక్తివంచన లేకుండా పాటుపడగలనని ప్రమాణం చేస్తున్నాను.

బహరైన్ (అరేబియన్ గల్ఫ్) — బి. హెచ్. ఎస్. నారాయణమూర్తి

### జనవరి సంచిక

జనవరి 'అభ్యుదయ' చదివేను 'దాహం' కథానిక బాగుంది. సీనియర్ గారి (శ్రీ కంభంపాటి సత్యనారాయణ) సమీక్ష సశేషం అయినా బాగుంది. ఏనుగుల వీరాస్వామి, అభిమాన గద్య రచయితల్లో ఒకరు. ఆయన సత్యకాలపు గడుసుతనం చాలా నవ్వు కలిగిస్తుంది. ఆయన వేదాంతం సరేసరి. వీటిని మించి వాస్తవ చిత్రణ, సాంఘిక ప్రాధాన్యం గలదని నా నమ్మకం.

ఢిల్లీ — జి. జె. రామారావు

## సమీక్ష

# వెలుగు రేఖలు

ప్రచురణ: ఇచ్ఛాపురం రచయితల సంఘం (ఇరసం), చాట్లవారి వీధి, ఇచ్ఛాపురం-532312 వెల : రూ. 3.

మూడు సంవత్సరాల నుంచీ సాహిత్య కార్యకలాపాలను సాగిస్తోన్న ఇరసం రెండు గల్పికలతోను, చాలా కవితలతోను ప్రచురించిన సంకలనం ఇది. మూడో వార్షికోత్సవ సందర్భంగా నిర్వహించిన మినీ కవితల పోటీకి వచ్చిన కవిత లివి. ఆంధ్ర ప్రదేశ్‌లోని అన్ని ప్రాంతాలకు చెందిన నవ కవులు దీనిలో కనిపిస్తారు. కవితాస్పర్శ వున్న కవులు దీనిలో కొందరున్నారు:

ఉత్తమ కవితగా బహుమతి పొందిన కవిత- "రంగబాబు" (పెదరావూరు).

"...బ్రతుకు బండికొక బాటుందని
వెతక్క
అందిన బాట వెంట అవతలి గట్టు జేరు.
...........................
మెట్టు మెట్టు కెక్కి వెనక్కి చూడకు.
ముక్కుకు సూటిగా గమ్యం దిక్కు నడు.
చిక్కటి చీకటి చుట్టూ వుందని తిట్టకు
చక్కటి ఉదయం సగం రాత్రిలో
సాధించు.

## పాఠకులకు మనవి

మీరు ఇదివరలో చెల్లించిన చందా రొఖ్ఖానికి సరిపడా ఎంతవరకు మీకు పత్రిక పంపబడుతుందో తెలియజేస్తూ మీకు చందా నెంబరు కేటాయించాము. మీ చిరునామా పైనే ఉన్న మీ చందా నెంబరును మీరు గమనించే ఉంటారు. దానిలో చివరి భాగం, ఏ సంవత్సరంలో, ఏ నెలతో మీ చందా ముగుస్తుందో తెలియ జేస్తుంది. దాని ప్రకారం మీ చందాను తిరిగి పొడిగించవలసినదిగా కోరుతున్నాము.

మీరు చందా పైకం పంపేటప్పుడు, మీ చందా నెంబరు తెలియజేసినట్లయితే, చందాల పట్టికలో, మీ చిరునామాను వెంటనే గుర్తించి, మీచందా కాలాన్ని పొడిగించేందుకు వీలు వుంటుంది. మీరు మాతో జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలన్నిటిలోనూ మీ చందా నెంబరు పేర్కొనవలసినదిగా కోరుతున్నాము.

---

ఫిబ్రవరి 5 (ఆదివారం) గోష్ఠి:
"నాకు నచ్చిన తెలుగు రచన"
పొట్టి శ్రీరాములు స్మారక మందిరంలో
సాయంత్రం 6 గంటలకు

## స్వీకారం

**దేముడు జీవిని చంపి మోక్షమిస్తాడా ?**

రచయిత : గుడిపాటి ప్రసాదరావు

ప్రచురణ : ప్రసాద్ పబ్లికేషన్స్,
వరంగల్-506006

వెల : రూ. 6.

**ప్రాణం - అదృష్టదీపక్**

(వచన కవితా సంపుటి)

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

వెల : రు. 2

# గారడీ

ఎవరో భయం కానుకగా
బుట్టల్నిండా పంపిన పండ్లు
యింట్లో ఎందరు తిన్నా
వొడవడం లేదు.
స్వశరీరాని కేమో
వెధవ తీపి రోగం.
ఎంతో విలువైన తీపితీపి పళ్ళు
ప్చ్—ఏం చేస్తాం?—
వేదాంతం రాలింది!
'ఒరేయ్ ఓ బచ్చాగా
కొయ్యేప్పుడు ఈ పళ్ళ కేసి'
మురగ బోతున్న పండ్లమీద
ఈ గలు గుయ్యిమని
హర్షం ప్రకటించాయి.

*　　　　*　　　　*

ఆఁ హలో హలో
ఏమేమి ఈ రోజు వానులో
పెద్దమనిషి సహకారం.
'విరాళమా
దాని దేముంది
ఇరవై వేలు తీసుకో'
ఆ గొంతులో
విడుదలయిన వైరాగ్యమంత
ఉత్సాహం.
చేతిలో వున్న తెల్ల రిసీవర్
తెల్లబడింది—ఆశ్చర్యం?

దేవరాజు మహారాజు

---

ముఖపత్ర గీతం : బాళ్ళ. చాందినీ
చార్ట్ చిత్రం : మోహన్

Edited and Published By T. Venkataramiah, at 15, Arulal aal Street Madras-600017 and Printed at Sri Venkateswara Printers, Madras-600021